

**కాశ్మీర్ సమాలోచనలు**

కాశ్మీర్ సమస్యపై ఢిల్లీలో పండిట్ నెహ్రూ, లియాకత్ అలీఖాన్, సర్ ఓవెన్ డిక్సన్‌గార్ల సమాలోచనలు.



# వార్తా చిత్రాలు





**కొత్తమంత్రి**

ఢిల్లీ మంత్రివర్గంలో ఒక సభ్యునిగా శ్రీమాన్ సి. రాజగోపాలాచార్యులుగారు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారి యెదుట ప్రమాణ స్వీకారం చేశారు.





**ఈద్ ముబారక్**

ఈద్ పండుగనాడు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు విద్యామంత్రి అబుల్ కలాం ఆజాద్‌గారి ఇంటికి వెళ్లి శుభసందేశం అందజేశారు.

# ఆంధ్రపత్రిక

| సంవత్సరచందా<br>రు. 12-0-0<br>విడిపత్రిక<br>4 అణాలు | ప్రతిబుధవారము ప్రకటింపబడును.<br>ఒరులేయవి యొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా<br>నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్<br>(మహాభారతము)<br>**Founder : K NAGESWARA RAO** | సంపుటము 4<br>సంచిక 47 |
|---|---|---|

వికృతి సంవత్సర నిజాషాఢ శుద్ధ ద్వాదశి బుధవారము



సంస్కారకర్మ

'మార్క్సుగనుక ఈనాడు జీవించిఉన్నట్లయితే గాంధీయ సిద్ధాంతాలకు అనుగుణంగా తన సిద్ధాంతాల్ని తానే చక్కదిద్దుకునేవాడు' అని జయప్రకాశ్ నారాయణ్ ప్రవచనం.






1950-వ సం॥ జూలై నెల 26-వ తేది బుధవారము

# మానవ జాతి

జాతి అను శబ్దమునకు సరిపోలిన, లేక సరితూగు శబ్దము ఆంగ్లమున లేదు. ఆంగ్లమున race, nation అను శబ్దములకు సరియగు అర్థము నీయగల పదములు తెలుగున గాని సంస్కృతమున గాని లేవు. కాని ఆంగ్లము నుండి ఆ రెండు పదములను తెనిగించవలసినపుడెల్ల జాతి అను పదమునే వాడుట పరిపాటి యైనది. Race అను పదమునకు 'తెగ' అను మాటను తెలుగులో వాడుట కద్దు. కాని ఇదియు సరి కాజాలదు. 'తెగ' అనగా ఆంగ్లమున మానవసమూహముల కుపయోగించు Group అను మాటకు సరిపోలవచ్చును.

శబ్దములయం దిట్టి సందిగ్ధస్థితికి మూలహేతువు భావప్రపంచమున వివిధ దేశస్థులలో కల వైవిధ్యమే. మానవజాతి, పశుజాతి మృగజాతి, వృక్షజాతి మొదలగు పదసమూహములో 'జాతి' అను పదము ప్రాణికోటిలో వివిధజాతుల భిన్న తెగలను వివరించుట కుపయోగపడినది గాని ఏయొక్క జాతిలోని భిన్న తెగలనూ వివరించుట కుపయోగింపబడలేదు. ఆంగ్లమున అట్లు గాక nation, race అను పదములు విభిన్నసభ్యతా విశేషములను, దేశభాషాదివిశేషములను పేర్కొనుటకు ప్రయోగింపబడుచున్నవి.

ఒక మానవుని ప్రాణములను హరించిన దో అది పాపములలో కెల్ల అతినీచమైనదిగ భావించి, సర్వమతములవారును దోషికి మరణదండన విధించుచుండిరి మానవుడు సాక్షాద్భగవత్స్వరూపు డని సర్వమతముల వారును విశ్వసించుటయే దీనికి హేతువు. (పశుపక్ష్యాదులుకూడ తాము భగవత్స్వరూపులని తలచునో యేమో మనకు తెలియరాదు.) అయినప్పటికిని ప్రాచ్యపాశ్చాత్యసభ్యతలలో నిచ్చట అత్యంత ప్రధానమైన వ్యత్యాసము కలదు. ప్రాచ్యదేశముల నాగరికతా విశేషములలో మానవులందరును సర్వసమానులు. కాని పాశ్చాత్యసంస్కృతిలో మానవులు బహుజాతులుగా తెగలుగా విభజింపబడి యున్నారని భావించబడుచున్నది. కావుననే జాతి, race, nation అను పదముల అర్థములలో అట్టి సందిగ్ధావస్థ యేర్పడినది.

ఆత్మజ్ఞానమును పొందుటలో మానవునకును మానవునకును వ్యత్యాస మున్నట్లే, చరిత్రానుభవమున వివిధ 'జాతుల' మధ్య వ్యత్యాసము లుండవచ్చును. కాని తెగ ననుబట్టి, జాతులను బట్టి మానవులలో మేధాశక్తి, గుణశీలములు, కృషినైపుణ్యముల వ్యత్యాసము లేర్పడుటలేదు. వీనిలో వ్యత్యాసము లేర్పడుటకు శిక్ష, అనుభవము, అభ్యాసములే మూలములు. శక్తిసంపదల యందు వ్యత్యాసములు జాతిమతభేదములను బట్టిగాని కులవర్ణములను బట్టిగాని యేర్పడజాలవు.

చిరకాలముగ జాతివైషమ్యములతో నిత్యయుద్ధము లొనర్చుచున్న పాశ్చాత్యదేశముల శాస్త్రజ్ఞు లీ విషయమును ఈనాటికి కనిపెట్టగలిగినారు.

ఐక్యరాజ్యసమితివారి విద్యాసాంఘిక సభ్యతా విషయసంఘమునియామకమున పాశ్చాత్యశాస్త్రజ్ఞులనేకులు జీవశాస్త్రజ్ఞులు, మనస్తత్త్వశాస్త్రజ్ఞులు, సాంఘికవిజ్ఞానవేత్తలు, మానవశరీరవిజ్ఞానశాస్త్రజ్ఞులు మొదలగువారు జాతిభేదములనుగురించి పరిశీలన జరిపి పై సత్యము నీనాడు కనిపెట్టినారు.

ఇంతవరకును పాశ్చాత్యుల 'జాతి' భేదములు తెగ (race), దేశము, భాష, మతము, సంఘాచారములు, సంస్కృతుల భేదములపై నాధారపడి నిర్ణయింపబడుచున్నవి. ఇవిగాక స్థూలముగ మంగోలియన్, నీగ్రో, కాకేషియన్ తెగలుగ (races) మానవజాతి నంతనూ విభజించినారు. ఈ భేదము సాధారణముగా గాని చిరకాలముగ 'జాతి' సాంకర్యమును శ్లేష కాదు

సర్గోని నూ ... ర్చిరి. వర్ణభేదములు ఆధారముగా శ్వేత'జాతు'లు అన్యజాతులను పీడించుచు వచ్చిరి.

క్రమక్రమముగ విజ్ఞానశాస్త్ర మభివృద్ధి చెందుచూవచ్చినకొలది సర్వదేశములకును ప్రయాణము సుగమ్యమై సర్వ'జాతుల' మధ్యనూ సామీప్య మేర్పడగానే, ఈ 'జాతి' భేదములను కాపాడుకొనవలె నను భావము శ్వేతజాతులకు హెచ్చినది. మహాసాగరములను ప్రయాణించి దాటు నౌకలు నిర్మాణమైనంతనే, తుపాకులు ఫిరంగుల సహాయమున ఆసియా ఆఫ్రికాఖండములను జయించి శ్వేత'జాతులు' ఆర్థికముగ పరజాతిపీడన ప్రారంభించి, అన్యజాతులపై ఆధిక్యతను స్థిరపర్చుకొన్నవి. స్థిరపర్చుకొన్న తమ ఆధిక్యతను సంరక్షించుటకొరకు పరజాతులతోడి సాంకర్యమును సమవ్యవస్థను నిషేధించినవి.

కాని ఇది యింతటితో పూర్తి కాలేదు. వైవిధ్యముపై ప్రాబల్య మార్జించుటతో ప్రారంభమైన జాతీయవిభిన్నతత్వము దేశభాష మతాచారములచే ఎక్కడికక్కడ విభజింపబడి శతాధికముగా విభిన్నజాతి భావములకు తావిచ్చినది. ఆధునికజాతీయయుద్ధములు యూరపునందును తదితర ప్రాంతములందును చెలరేగినవి.

మత మొకటైనను దేశములు వేరగుట వైరములకు హేతువైనది. దేశ మొకటైనను భావలు వేరగుట సంఘర్షణకు దారితీసినది. ఈరీతిగా పాశ్చాత్యచరిత్ర యంతయు నిత్యసంఘర్షణతో నిండిపోవుటకు జాతివిభిన్నతత్వమే హేతువైనది.

భారతదేశమునగూడ దురదృష్టవశమున మత మొకటైనచోటగూడ కులభేదములు స్థిరపడినంతనే, ఆర్థికవ్యవస్థతో వచ్చిన సంఘర్షణ కులమతాదులమధ్య సంఘర్షణగా పరిణతి నొందినది. వృత్తి ప్రధానమగు గ్రామీణవ్యవస్థ కులవైరములకు గురియై భగ్నమైనది. దీనితో ప్రజల ప్రశాంతజీవనమున విషము పడినది.

కాని మానవునకును మానవునకును ఆకారము నందు వ్యత్యాస ముండునట్లే, ఆయా జాతిమత కుల వర్ణాది వైవిధ్యములు స్థూలమైనవే గాని వస్తుప్రధానమైనవి గావని తిరిగి తెలుసుకొనుటకు నేడొక ప్రపంచ సంస్థ పరిశోధన జరుపవలసివచ్చినది. మేధాశక్తిలో, శారీరక బలము పదలో, సత్వరజస్తమోగుణముల లక్ష్యములో వ్యత్యాసములు దక్క, మానవునకును మానవునకును వ్యత్యాసము లేదని భారతీయసంస్కృతి చెప్పుచున్నది. కొన్ని హిందూపూజాపాఠములు ప్రత్యంగమును పేర్కొని ఇన్ని యంగములతో యున్న మానవశరీరనిర్మాణము కొనియాడబడును. పురాణములన్నియు మానవప్రకృతివిశిష్టతను పించుచున్నవి. ఎల్లయెడలను సార్వజనీనమైన సములు సిద్ధాంతీకరించబడినవి.

పరిశోధనతో నిమిత్తము లేకనే భారతీయ హృదయంగమ మొనర్చుకొన్న ఈ సత్యమును ప్రకటించుటకు పాశ్చాత్యులు శాస్త్రీయ పరిశోధన జరిపి గ్రహించినారు.

ఇంతవరకును ప్రపంచమును సంఘర్షణకు మూలమైన ఈ జాతిభేదతత్వము పూర్తిగ నశించినగాని ... ములు, నివార్యము కాజాలవు. లోకములోని సమాజముల మధ్యనూ సహకారము సాధ్యము కాజాలదు. ప్రపంచమున యుద్ధములను దుర్భిక్షమును నివారించవలెనన్నచో తిరిగి సర్వజనశ్రేయఃకాంక్షి పూర్వభారతీయసంస్కృతియే శరణ్యమగును.

మానవుడు సంఘజీవి. సంఘర్షణ తద్లక్షణము. ఈ సంఘర్షణ ప్రతీయమానమగను ప్రత్యక్షముగనో ప్రచ్ఛన్నముగనో కొనసాగుచునే యుండును. ఆకారమున వ్యత్యాస మున్నను అసలున్న మొకటే యైనట్లు, సంఘర్షణ, సహకారములు జోడుగా సాగిపోకతప్పదు. కావుననే ఒక్క సమునకు చెందిన వర్గములమధ్య, ఒక్క సంఘమునకు చెందిన వ్యక్తులమధ్య గూడ సంఘర్షణ సహకారములు నిరాటంకముగ కొనసాగుచుపోవుచున్నవి.

సర్వజనసమత్వసిద్ధాంతము లోకమున కార్యమైననాడే పరపీడన, దౌర్జన్యము లంతరించగలవు. సర్వజనసమత్వవ్యవస్థలోనే మానవుడు పూర్ణవికాసము నొందుటకు అవకాశము కల్గును. మానవునకును అన్యమానవునిలోని మానవత్వమందు విశ్వాసము కలిగినగాని సంఘమునందట్టి విశ్వాసము జనించదు. అప్పుడే సంఘశ్రేయము, వ్యక్తిశ్రేయము సంఘశ్రేయము ... దోహదములు కాగలవు.

# ప్రపంచ యుద్ధమునకు సన్నాహములు

ప్రపంచ విస్తృతసంగ్రామమునకై రష్యా అమెరికాలు పెద్దపెట్టున సన్నాహము లారంభించినవి. అమెరికన్ ప్రభుత్వము దేశరక్షణనిమిత్తము బడ్జెట్‌లో ప్రత్యేకించిన 1350 కోట్లు డాలర్లు కాక అదనముగా వెయ్యికోట్ల డాలర్లఖర్చునకు కాంగ్రెస్‌అనుమతిని కోరినది. స్వదేశరక్షణకు, మిత్రుల రక్షణకు, ఎప్పటి కప్పుడు రాగల యవసరములకు చాలినంత ఖర్చునకు అనుమతి కోరినది. ఈఖర్చులకు కాంగ్రెస్ అనుమతించగలదనియే భావించవచ్చును. రష్యాకూడ దురాక్రమణపరుల నెదిర్చి పోరాడుటకు సన్నాహము చేయ నిశ్చయించినట్లు మాస్కో-రేడియో ప్రకటించినది. రష్యా మిత్రులు వివిధదేశములందు 'శాంతిరక్షణ' కొరకును, 'జాతీయదాస్యవిముక్తి' కొరకును సిద్ధమగుచున్నారు.

ఉభయపక్షములును స్వదేశరక్షణకే గాక మిత్రుల సంరక్షణకుకూడ తయారగుచున్నవి. కాని వీరి మిత్రులలో వాస్తవముగ సంరక్షణను, సహాయమును కోరుచున్న వారెందరో తెలియదు. మిత్రులు కోరినను కోరకపోయినను వారిని సంరక్షించు బాధ్యతను మాత్ర మీదేశములపై నిడుకొన్నవి. కాబట్టి రష్యా అమెరికాలమధ్య యుద్ధము సంభవించినప్పుడు ఏ మిత్రులును శత్రువులును తటస్థదేశములును గూడ ఈ మారణహోమమునుండి రక్షించుకొనుట అసంభవమని రూఢియగుచున్నది. రష్యా అమెరికాలు కాక అన్యదేశములు దేశరక్షణ కెంత బలమును సమకూర్చుకొన్నను వాస్తవముగ ఉభయదేశములలో ఏయొకరి ధాటికినీ తాళజాలవు. అయినను అట్లు బలమును సమకూర్చుకొన్నచో ఉభయులలో ఎవరో యొకరికి లోబడక తప్పని పరిస్థితికూడ రావచ్చును.

ఈరీతిగా ప్రపంచమును 'ఉన్నట్లుండి ఆకస్మికముగ యుద్ధమేఘము లావరించుటకు తక్షణహేతువు కొరియాఅంతర్యుద్ధము. ఈ అంతర్యుద్ధమే ప్రపంచ చరిత్రలో ప్రధానఘట్టమైనది. ఒక దేశమున సంభవించు అంతర్యుద్ధము, అనేకదేశములను యుద్ధములోనికి దించుటకు హేతువగుట ఇదే ప్రథమము. గడిచిన రెండు ప్రపంచయుద్ధముల విధానమునకు రానున్న ప్రపంచయుద్ధము భిన్నముగ నుండునని నిరూపించునదియు నిదియే. రష్యా అమెరికాల యుద్ధవ్యూహములలోని వ్యత్యాసమును, రాజకీయతంత్రములలోని వ్యత్యాసములను స్పష్టపరచినదియు నీ యుద్ధమే. రానున్న ప్రపంచయుద్ధమున దేశములమధ్యను జాతులమధ్యనే గాక, అనేకదేశములలో అంతర్యుద్ధములు కూడ ప్రధానమైనవి కాగలవని కొరియాయుద్ధము నిరూపించుచున్నది. ఇకముందే దేశమందైన అంతర్యుద్ధము సంభవించినచో రష్యా అమెరికాలు ప్రమేయము లేకుండ నుండవని రూఢిమైనది. ఇంతే కాక వివిధ కమ్యూనిస్టుదేశములు సైనికముగా నెంత బలపడినవో, ఆ బలముల నోడించుటకు ఆయుధపరికరము లెంతవర కుపయోగపడునో, సైనికుల సంఖ్యాబలమెంత యవసరమో కూడ అమెరికాకు తెలిసివచ్చినది.

కమ్యూనిస్టురాజ్యకూటమి నోడింపవలెనన్న అమెరికా ఎంత బలమును సేకరింపవలెనో అంచనావేసి ట్రూమన్ ప్రభుత్వము తత్ప్రకారము సన్నాహములు చేయ నమకట్టినది. ఈ అంచనాకు కొరియా యుద్ధము కొలబద్ద యైనది. రష్యాకూడ అదేవిధముగ అంచనా వేసి సన్నాహము చేయుచున్నది.

ప్రపంచయుద్ధ మెట్లునూ అనివార్యమే నను భావము ప్రపంచమంతటను వ్యాప్తిచెందినది. కాబట్టి ఆ యుద్ధము జాప్యమగుటకంటె వెంటనే సంభవించినచో మేలని భావించెడివారినాడు చాలమంది కలరు. జాప్యమైనకొద్దీ ప్రాణనష్టము సంపదవినాశము పెరిగిపోక తప్పదని ప్రపంచయుద్ధము లొకదానితరువాత ఒకటి నిరూపించినవి.

ఇట్టి పరిస్థితిలో భారతదేశ ప్రధానమంత్రి పండిట్ నెహ్రూశాంతిప్రతిపాదన విఫలమగుటలో నాశ్చర్యము లేదు. పండిట్ నెహ్రూ సహృదయత ఉభయులకునూ అవగతమే. కాని ఉభయులలో ఒకరు తంత్రము పన్ని శాంతిసూచన నంగీకరించినట్లు చెప్పినారు. మరొకరు నిష్కర్షగ నిరాకరించినారు. ఈ బుద్ధివైపరీత్యమునకు హేతువు వినాశకాలము దాపురించుటే నని మాత్ర మర్థమగుచున్నది.

---

ముఖచిత్రం: 'జీవితం' తెలుగు సినిమాలో అభినేత్రి వైజయంతీమాల.

# మనదేశం

## ఉత్సవాలు *

మతం ఒకరికి మనస్సును కలకదేరిస్తే ఒకరికి ఉన్మాదావేశాలు రెచ్చగొట్టడం కద్దు. ఈఏడు పండుగ మహమ్మదీయులందరికీ భారతదేశంలోనూ పాకిస్తాన్‌లోనూ ప్రశాంతంగా గడిచిపోయింది. జగన్నాథ రథోత్సవం పూరీ పుణ్యక్షేత్రంలో కొందరు సాధువులలో జోరగుణాన్ని ప్రకోపింపచేసింది. వందలాది యాత్రీకులచేత లాగబడే జగన్నాథరథాన్నెక్కడానికి యత్నించిన కొందరు సాధువుల్ని పోలీసులు అటంకపెట్టారు. సాధుజనత్వానికి అఘాతం తగిలింది కాబోలు రెండువందలమంది సాధువులేకమై కొమ్ము చెంబులూ త్రిశూలాల్తో పోలీసుల నెదుర్కొన్నారు.

పోలీసుల టోపీలే సొట్టపడ్డవో, కొమ్ము చెంబులే సొట్టపడ్డవో ఫలితం మాత్రం సాధువులికూడా సామాన్యసంసారులకువలెనే కారాగారదండన విధించబడింది.

## విమాన ప్రమాదం *

కాశ్మీరంలో సైనికోపసంహారణవిషయమై ఢిల్లీలో ఉభయదేశాల ప్రధానమంత్రులు, భద్రతామండలి నియమించిన మధ్యవర్తి సర్ ఓవెన్ డిక్సన్ సమాలోచనలు ప్రారంభించడానికి సరిగ్గా మూడు రోజులుముందు పఠాన్ కోటవద్ద విమానం కూలి అంతర్జాతీయసైనికాధికారులు, నెహ్రూ కార్యదర్శి తదితరులు మృతిచెందారు. డిక్సన్‌కు సైనిక విషయ సలహాదారుగా నియమితుడైన అమెరికన్ సైనికోద్యోగి జనరల్ హాడ్జెస్‌కి ఈప్రమాదం కొద్దిలో తప్పింది. ఇండియన్ నేషనల్ ఎయిర్వేస్‌కి చెందిన కోటా ప్రయాణీకుల విమానం శ్రీనగర్‌కి వెడుతూ, దారిలో చాక్కీనది సమీపంలో పర్వతపాతం మూలంగా కూలిపోయింది. మృతిచెందినవారిలో ముగ్గురు భారతసైనికోద్యోగులు, పండిట్ నెహ్రూ కార్యదర్శియైన శ్రీ ద్వారకానాథ్ కచ్రు, ఐక్యరాజ్యసమితివారి కాశ్మీర్ సైనిక పర్యవేక్షులు ముగ్గురు ఉన్నారు. మొత్తం ప్రయాణీకులు 18మంది, వైమానికులు నలుగురూ మృతిచెందారు.

## ధరల పెరుగుదల *

ఎక్కడో కొరియాలో యుద్ధం సంభవించిందని అమెరికాలోవలెనే భారతదేశంలో కూడా వస్తువుల ధరల్ని వ్యాపారులు పెంచేస్తున్నారు. చిక్కినంతమటుకు వస్తుసామగ్రిని చీకటిగదుల్లో దాచేస్తున్నారు. దిగుమతి చేసుకోనక్కర్లేని నూనెలు మిరపకాయలు పప్పులు నెయ్యి కూరల ధరలుకూడా ఎందుకు పెరగాలో ఎవరికీ తెలియదు. ప్రస్తుతధరలుకూడా అక్కడక్కడ పెరిగాయి. కొన్ని మిల్లుల్లో డబ్బాడే ఎక్కువ ధరలకి అమ్మడం, ఉన్న మట్టుకు దాచెయ్యడం జరిగింది. కంట్రోల్స్ తీసెయ్యాలని అడిగినంతసేపు పట్టలేదు వ్యాపారుల నీతిబండారం బైటపడ్డానికి. మందుల ధరలు మరీ మితిమీరిపోతున్నాయి. కాని ఈమారు ప్రభుత్వం కఠినచర్యలు తీసుకుని వ్యాపారుల స్వేచ్ఛాశేషన్ జూదపు ఆటలు కట్టించగలరని మంత్రులు మెహతాబ్ మున్షీ గట్టిగా చెప్తున్నారు.

ఈ సందర్భంలో కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలతో సమాలోచనలు సాగిస్తోంది. ఇప్పటికి పేపరు, కిరసనాయిలు, సిమెంటు, బొగ్గు మొదలైన సరకులపైన కంట్రోల్స్ తొలగించబడినాయి. ఇప్పటికింకా వీటి ధరలు పెరగలేదు. పెరగవనే సూచన కాబట్టి ముందుగా చీకటికొట్లలోకి పోకుండా ఈ సరుకుల్ని కాపాడినట్లు ప్రభుత్వం ధరల్ని అట్టే పెచ్చు పోకుండా అణిచిపెట్టడానికి వీలవుతుం[ది].

పంచదార ఎలాగూ దిగుమతి చే[యక] తప్పదు. కేవలం మన ఫాక్టరీల్నే పర్త[?] నమ్ముకుంటే మరోకసారి (క్రిందటేడు రీగా) నమ్ముకుంటాము లాభాలుగా అవ[న్నీ] పోయేమాట నిజం. కాబట్టి ప్రభుత్వం మాసంలో దిగుమతి చెయ్యదల్చుకు[న్నట్టు] ప్రకటించిన పంచదారని దిగుమతి చే[సి] మన వర్తకుల్ని అదుపులో పెట్టడానికి పడుతుంది.

## కమ్యూనిస్టుపార్టీ పంథా

భారత కమ్యూనిస్టుపార్టీ పొలిట్‌బ్యూ[రో] బొంబాయిలో సమావేశమై, హత్యాకా[ండ] విధ్వంసకచర్యలను త్యజించి "జా[తీయ] దాస్య విముక్తి" "వ్యవసాయిక సంస్క[ర]ణే ప్రధానాంశాలుగా ఉద్యమం నడప[గలమని] ప్రకటించారు. ఇకనుంచి ఉద్యమాన్ని కమ్యూనిస్టు ఉద్యమపంథాలో నడ[ప]దల్చా[రు].

పంథా మార్పుతోపాటు నాయకత్వ[ం] కూడా మార్పు తెచ్చారు. బి. టి. ర[ణది]వే ఆంధ్ర కమ్యూనిస్టు నాయకుడు చంద్రరాజేశ్వరరావు పార్టీప్రధాన [కార్యద]ర్శి అయినాడు. మార్క్సిస్టు—లెని[నిస్టు]—స్టాలినిస్టు గీతకి కొద్దిగా ఎడముగ[...]

(36-వ పేజీ చూడుడు)



దక్షిణప్రాంత సర్వసేనాని మహరాజ్ శ్రీ రాజేంద్రసింగ్ జీ ఈవారం మద్రాసునగరం సందర్శించారు.

లభించడానికి రెండో ప్రపంచయుద్ధంలో కొన్ని ఘట్టాలు హేతువులు.

ప్రపంచంలోకల్ల పఠాన్లు, తూర్పు ఆసియాలోకల్ల జపానీయులు, యూరప్‌లోకల్ల జర్మన్లు యుద్ధంలో అద్వితీయులని ప్రసిద్ధి, ప్రపంచంలో రాజ్యాలన్నీ కొత్త ప్రపంచం ప్రాభవసంపదలపై చకితదృష్టితో చూస్తూండగా, యుద్ధంలో, సాహసంలో కూడా తాము అగ్రగణ్యులని నిరూపించుకోవాలని కొత్తజాతి అమెరికా యత్నించింది. రెండో ప్రపంచయుద్ధంలో వారి ఆయుధబలాధిక్యత ఈ కార్యాన్ని కొంతవరకు సాధించగలిగింది. జర్మన్లు అగ్నివర్షం కురిపిస్తుండగా అగ్నిముఖాన కెనేడియన్ సేనలను ఫ్రాన్సు తీరంలో దింపి ముందుకు నడిపారు. ఐసెన్‌హోవర్, బ్రిటిష్ సేనాధిపతి మాంట్‌గామరీలు, జర్మనీలో నాజీ ప్రాబల్యాన్ని భగ్నం చేయడానికి విమానబలాన్ని విశేషంగా ప్రయోగించారు. తూర్పున ఫిలిప్పైన్సులో నిలిచి తుదివరకూ జపాన్ సైన్యాలతో పోరాడి శత్రువుల మెప్పునుకూడా పొందాడు జనరల్ మెకార్థర్. ఆ దీవుల్ని విడిచి పారిపోవలసినప్పుడు భార్యపుత్రసమేతంగా ఒక చిన్న గస్తీ నౌకలో శత్రునౌకల్ని జలాంతర్గాముల్ని తప్పించుకుంటూ అనేక దినాలు పసిఫిక్ మహాసాగరంలో రాత్రి పూటనే ప్రయాణంచేసి ఆస్ట్రేలియా చేరాడు. జపాన్ నౌకాబలాన్ని కన్నుగప్పి తప్పించుకున్న మెకార్థర్ అమెరికన్ సైనికులకు ఆదర్శపురుషుడైనాడు. తిరిగి ఫిలిప్పైన్సు దీవుల్ని ఆక్రమించుకునేటప్పుడు కూడా జపాన్ సైన్యాలతో ఘోరయుద్ధం చేసి మనిలానగరాన్ని దాదాపు భస్మీభూతం చేసి విజయం సాధించాడు.

మెకార్థర్ ఐసెన్‌హోవర్లిద్దరూ సైనిక వీరులేకాదు, ప్రజాస్వామ్య సిద్ధాంతాల్ని విశ్వసించి, ఆ సిద్ధాంతాలకోసమే యుద్ధాలలో పాల్గొన్న రాజకీయవేత్తలుకూడా. ఆ సిద్ధాంతాలే తమకు విజయం చేకూర్చినవని విశ్వసించే యోధులు. అమెరికన్ జాతీయ సైనిక ప్రాబల్యకుతూహలాన్ని తీర్చిన అమెరికన్ నాయకులు.

వీరిద్దరిలో ఐసెన్ హోవర్ రెండో ప్రపంచ యుద్ధంలోనే ఖ్యాతికి వచ్చాడు. కాని మెకార్థర్ ఆరంభంనుంచీ అమెరికన్ జాతికి ఆదర్శపురుషుడే.

మెకార్థర్ తండ్రి జనరల్ ఆర్థర్ మెకార్థర్ ఫిలిప్పైన్సు యుద్ధంలో (1898) పాల్గొని, స్పానిష్ సైన్యాలను జయించి మనిలానగరాన్ని ఆక్రమించుకొన్నాడు. స్పానిష్ ఆక్రమణనుంచి విముక్తినిచ్చి ఫిలిప్పైన్సు దీవుల ప్రజలకి ప్రజాస్వామ్యాన్ని నేర్పడానికి, తండ్రి అక్కడ నివసించినంతకాలం డగ్లస్ మెకార్థర్ బాల్యం అక్కడే గడిచింది. ఆసియావాసుల స్థితిగతుల్ని బాగా అవగాహన చేసుకున్న నాయకులు అవసరమైనప్పుడు, అమెరికన్ అధ్యక్షుడు థియోడర్ రూజ్వెల్ట్‌కు ఇద్దరే వ్యక్తులు కనిపించారట. వారు జనరల్ ఆర్థర్ మెకార్థర్, అతని కుమారుడు డగ్లస్ మెకార్థర్. జపాన్—రష్యా యుద్ధంలో (1904) వీరిద్దరూ అమెరికన్ పరిశీలకులుగా పంపబడ్డారు.

ఆసమయంలో జపాన్‌ను అమెరికా ప్రోత్సాహపరిచింది. ఆ యుద్ధంలో జపాన్ సైన్యాలకి విజయం లభించినది మొదలు డగ్లస్ మెకార్థర్ జపాన్‌పైన ఒక కన్ను వేసి ఉంచాడు. జపాన్‌లో ప్రజల జీవిత
విధానం అమెరికన్ జీవిత విధా
భిన్నంగా ఉంది. రాజకీయవ్యవస్థ
ఆశయాలు వేరు. రష్యావలెనే జ
కూడా సామ్రాజ్యవిస్తరణకాంక్ష
దనీ, రష్యా - జపాన్ల వ్యవస్థలు, ఆశ
ఆదర్శాలు ప్రజాస్వామ్య విధానాని
మైనవనీ డగ్లస్ మెకార్థర్ గుర్తి
రష్యా జపాన్లు రెండింటినీ అదుపులో
పోయినట్లయితే ప్రజాస్వామ్యవి
ఆసియాలో అమలు జరగడం అసం
గ్రహించాడు. ఈ ఉభయదేశాల సా
విస్తరణ కాంక్షల్ని అరికట్టా
ఆసియావాసులతో పోరాడగల యో
అమెరికా తయారుచేసుకోగలగాలని
అభిప్రాయం.

కేవలం సైనికజీవనమే ప్రధా
సైనికబలంతోనే సామ్రాజ్యశక్తుల్ని
అమెరికన్ నూతన ప్రజాస్వామ్య త
ఆసియాలో అలవరచడం ప్రధానకర్త

(35-వ పేజీ చూడుడు)

# నేటి ప్రపంచం

## శాంతిసూచన వైఫల్యం *

ప్రపంచయుద్ధం సంభవించకుండా శాంతిని కాపాడ్డానికి భారత ప్రధాని పండిట్ నెహ్రూ చేసిన యత్నం విఫలమయింది రష్యన్ అమెరికన్ ప్రభుత్వాల యుద్ధసన్నాహాల్ని గమనించినవారికి సన్నాహాలు కేవలం దేశరక్షణకోసమేనని కాదనీ, కాబట్టి యుద్ధనివారణకు ఎవరు యత్నించినా విఫలం కాక తప్పదనీ స్పష్టంగా తెలుసును.

చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని భద్రతా మండలిలో ప్రవేశపెట్టి కొత్త భద్రతా మండలిలో తిరిగి కొరియా సమస్యను తెచ్చి దురాక్రమణను నిరోధించాలని పండిట్ నెహ్రూ రష్యన్ ప్రధాని స్టాలిన్ కీ,



పండిట్ నెహ్రూ

అమెరికన్ విదేశాంగమంత్రి ఎచిసన్ కీ, బ్రిటిష్ ప్రధాని అట్లీకి లేఖలు వ్రాశారు. పండిట్ నెహ్రూ లేఖ అందిన వెంటనే స్టాలిన్ జవాబిచ్చాడు నెహ్రూ సూచనను మోదిస్తూ, కొత్త భద్రతామండలి ఉత్తర కొరియన్ ప్రతినిధిత్వాన్ని కూడా వినా లన్నాడు. కాని ఎచిసన్ అట్లీలు నెహ్రూ సూచనను నిరాకరించారు నిరాకరిస్తూ భద్రతామండలిలో చీనా కమ్యూనిస్టు ప్రభుత్వ సభ్యత్వ సమస్యకి కొరియా యుద్ధసమస్యకీ ముడిపెట్టకూడదన్నారు

బ్రిటన్ అమెరికాలుకూడా సూచన నంగీకరించివుంటే కొత్త భద్రతామండలిని సమావేశపరిచి, కొరియాలో యుద్ధవిరమణ తీర్మానానికి ముందుగా సమ్మతించాలని



స్టాలిన్

రష్యాచీనాలకు భారతప్రభుత్వం ఒత్తిడిచేసి ఉండేదనీ, అప్పుడే ప్రపంచానికి రష్యా చీనాల వైఖరి బోధపడి ఉండేదనీ భారత ప్రభుత్వం అభిప్రాయం. అదంతా భారత ప్రభుత్వం అనుకున్నట్లుగా జరిగివుంటే, అంటే బ్రిటన్ అమెరికాలు నెహ్రూ సూచనను అంగీకరించి, తరువాత కొరియాలో యుద్ధవిరామానికి రష్యాచీనాలు సమ్మతించివుంటే, ఏమి జరిగివుండేది ? దక్షిణకొరియానుంచి ఉత్తర కొరియన్ కమ్యూనిస్టుసేనలు నిష్క్రమించవలసి వచ్చేది వెంటనే కొరియా అంతటినీ సమైక్యంచేసి ఏకప్రభుత్వాన్ని స్థాపించవలసిన అగత్యం కలిగేది. ఇదికూడా భద్రతామండలి పరిష్కరించవలసిన అగత్యం కలిగేని.

ఇదికూడా భద్రతామండలి పరిష్కరించవలసిన అగత్యం కలిగేది అంటే (ప్లెబిసైట్) జనవాక్యనిర్ధారణ ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంకింద జరపవలసి వచ్చేది దురాక్రమణదోషం గురించి ఉత్తరకొరియన్ల వాదం వినకుండా కమ్యూనిస్టు సైన్యాల్ని తరలించడానికి రష్యా అంగీకరించడం సందేహం. అందు కొప్పుకున్నా జనవాక్య నిర్ధారణ జరపడం రష్యా అమెరికాలకు సమ్మతంకావడం అంతకంటె సందేహం. అందువల్లనే స్టాలిన్ ముందుకాళ్లకు బంధాలువేశాడు. కొత్త భద్రతామండలి సమావేశమై కొరియాసమస్యను తిరిగి చర్చించడాని కొప్పుకుంటూ, ఉత్తరకొరియన్ ప్రభుత్వం వాదన వినాలని షరతు పెట్టాడు. ఇది అమెరికాకు ఇష్టంలేదు. కాబట్టే నెహ్రూశాంతిప్రతిపాదన విఫలంకావడానికి స్టాలిన్ ఎచిసన్ లిద్దరూ కారకులైన ప్పటికీ, నిందమాత్రం ఎచిసన్ పైన పడింది.



ఎచిసన్

ఈ పట్టుకి అమెరికా అంగీకరించివుంటే రెండో పెట్టు త్రోసిపుచ్చిన నింద రష్యా పైన పడివుండేది రెండో మెట్టుకి రష్యా అంగీకరిస్తుందని భావిస్తే మూడో మెట్టు తరువాత ఈ అంశంపైన దక్షిణకొరియాలో తీవ్రఆందోళన ప్రారంభమయింది

37-వ పేజీ చూడుడు)



ఏడేళ్ళకే గోవిందం తనపొట్ట తాను పోసుకోవలసి వచ్చింది ఎన్నాళ్లు తిరిగినా ఎక్కడా ఏపనీ దొరకలేదు. విసిగిపోయి ఒకరోజున ఒక కంసాలిదుకాణంలో అడుగుపెట్టాడు అతికష్టం మీద అక్కడ వాడికొక పని కుదిరింది అన్నంపెట్టి గుడ్డ

## శ్రీ అమరేంద్ర

లిచ్చి బంగారంపని నేర్పేఒప్పందం పనిలో చొరవకలిగినాక జీతం బత్తెం ఏర్పాటు చేసే షరతు

ఇల్లు అద్దంలాగా వూడ్చి, కుంపటిలో బొగ్గులువేసి గొట్టంతో అస్తమానం కణకణమండేట్లుగా వూదుతూవుండటం, దీపంలో చమురు పొయ్యటం, గ్లాసులు తుడవటం, యజమాని రంగాచారికి పొగాకు కాడలు తీసిచుట్టలు చుట్టివ్వటం, యజమానిపిల్లల్ని ఆడిస్తూవుండటం —ఈ పనులన్నిటితో క్షణం ఊపిరి పీల్చుకోటానికికూడా తీరేది కాదు గోవిందానికి నా అన్నవాళ్లులేరు రాత్రిపూట దుకాణం అరుగుమీదే పడుకునేవాడు

ఈ చాకిరితో పదేళ్లు దొర్లిపోయినై

ఈ పదేళ్లలో ఎన్నెన్నో మార్పులు వచ్చినవి రంగాచారి పెంకుటిల్లు ముందు డాబాగానూ తరవాత రెండంతస్తుల మేడగానూ మారింది గోవిందం వుద్యోగం మటుకు గుమాస్తాకొక జత్తెముగానే వుండిపోయింది మునుపు ఏడాదికొక పాతలాగూ ముఖాన పారేస్తే ఇప్పుడు ఏడాదికొక కొత్తదోవతి ఇస్తున్నారు మునుపు బీడీలకి రోజుకొకకాని ఇస్తే ఇప్పుడు అర్ధణా ఇస్తున్నారు జీతం పెరగలేదు కాని పనిలోమటుకు బాని చెయ్యి తిరిగింది కొత్త కొత్తమోస్తరు నగలగా సునాయాసంగా తయారు చెయ్యగలడు అయినా గోవిందం జీవితంలో అసంతృప్తిఎరగడు. తనవాళ్లెవరూ లేకపోవడంచేత యజమాని ఇల్లే తన ఇల్లనుకొని సుఖంగాపోయిగా కాలక్షేపం చేస్తున్నాడు

నల్లటి శరీరం, మోటుతేరిన కంఠలూ, వసారాక్రాపూ చూడగానే గోవిందం పల్లెటూరివాడని తెలిసిపోతుంది ఈ పదేళ్ళలోనూ యజమాని ఏపనిచెప్పినా తననోటితో చెయ్యనని చెప్పేఎరగడు పగలూ రాత్రీ క్షణమైనా విశ్రాంతి లేకుండా పనిమీదనే వుండేవాడు యజమాని మాట గోవిందానికి వేదవాక్కు ఎన్నడూ జవదాటలేదు.

రంగాచారి అరవయ్యోపడిలో పడినప్పటికీ అరితేరిన చెయ్యికనక అంతా అత నగలు చేయించుకోవాలని ఉవ్వి తారు కొంచెం వయసు వొంగి దృష్టి తగ్గకపోవటంచేత కళ్లజోడు డానే శ్రద్ధగా పనిచేస్తూవుండేవాడు రకాల పనిపడిల గొలుసులు చెయ్యట రంగాచారిది అందెవేసిన చెయ్యి ఇంకా చాలామంది పనివాళ్లున్నా అ రంగాచారిమీదే గురి అతని గి అంతులేదు. అతనితో పోల్చి నిల కంసాలి ఆప్రాంతంలో లేడు

పెద్దవాడవటంచేత రంగాచారి రణంగా ఇల్లు కదలటంలేదు. బదులు కొడుకు రామాచారిని ప వుంపేవాడు మునుపు అన్ని పనులూ చారి సొంతంగా చేసుకునేవాడు. కొ పెద్దవాడయినాక తండ్రిని కదలని లేదు తండ్రి పాతకాలపు మనిషికనక మాటలూనవడీ చాదస్తంగా కనిపిస్తుం అనుమానంతో రామాచారి పెద్దప ఇళ్లకి తనే వెళ్లి ఆర్డర్లు పుచ్చుకుని న్నాడు

రామాచారికి కోపంవస్తే అగ్గిరా అతనంటే కర్లందరికీ హడల్, ఏ పొరబాటు జరిగినా పాకర్లనీ భడముడా జీతం విరక్కోసి పంపివిడిచేసేవాడు సుకి పుత్రవాడైనా ఇప్పుడు దుకాణ అతని చేతిమీదుగానే నడుస్తోంది

సంక్రాంతి పండగ సందడిలో గిరాకీ మరీ ఎక్కువైపోయింది. ఎ జీతంమీద అదనంగా నౌకర్లని వేసి తండ్రీకొడుకూ క్షణం తీరిక లేకుండా పొద్దులు మరిచి దుకాణంలో కూర్చు పని తెమలకుండా వుంది. పండగ స్తోంది పనిమటుకు ఆవగింజలో అర మైనా కాలేదు

తిండీ తిప్పలూ లేకుండా మ రోజులు ఒకే పనిమీద కూచోని రంగ నెక్లెస్ పూర్తిచేశాడు. ఆ నెక్లెస ధనిక కుటుంబం పురమాయించింది. తోనూ రత్నాలతోనూ పొదిగిన అ స్ని రంగాచారి ఒక్కచేతిమీద తయ చేసి తన పనితనమంతా దాంట్లో పించాడు. తన మనసుకి నచ్చిన నగిషి ఆ నగని అద్భుతంగా తయారుచేశాడు

ఇప్పటికాలంవాళ్లకి, నాజూకు బలిసిపోయి నగలలో బంగారం తగినంత పెట్టరు. మూడు కాసుల ఎత్తు బంగారంతో మూడు జతల గాజులు కావాలనేవాళ్లు కొందరూ, తులంనర బంగారంతో నెక్‌లెస్ కావాలనే వాళ్లు కొందరూ! అందువల్ల తన పనితనాన్ని పూర్తిగా ప్రదర్శించేందుకు రంగాచారికి ఇటీవల తగిన అవకాశమే దొరకటం లేదు. తగినంతబంగారం పెట్టి నెక్‌లెస్ అందంగా చెయ్యమని పురమాయించేసరికీ రంగాచారికి బ్రహ్మానందమయింది. తన శక్తినంతనీ ధారపోసి ఆ నగని తయారుచేసి ఎంతో సంతృప్తి పొందాడు రంగాచారి.

తయారుకాగానే ఆ నగని రామాచారి తీసుకెళ్లి ఇచ్చిరావలసింది. కాని పని తొందరవల్ల ఆ ధనికుల ఇంటికి తన బసులు కుంద్రిని పంపించాడు. మనసులో ఇష్టంలేకపోయినా పంపక తప్పలేదు.

ఆధనికుల ఇల్లు దుకాణానికి చాలా దూరం. ఒంటరిగా పోగల ధైర్యం లేక గోవిందాన్ని కూడా వెంట పెట్టుకుని వెళ్లాడు.

నడిచి నడిచి ఎల్లాగో వాళ్ళఇంటికి చేరుకుని తలుపు కొట్టాడు. వెంటనే తలుపు తీశారు. రంగాచారిముందూ వెనకాల గోవిందం వెళ్లి పరిచివున్న తివాచీమీద తాపీగా కూచున్నారు. చాలా పెద్దహాలు. గోడలనిండా పెద్దపెద్ద రంగు రంగుల బొమ్మలూ, అద్దంలాగా నీడలు కనబడుతున్న పాలరాతిగచ్చూ, ఆకుపచ్చముఖమల్ దిళ్లతో అలరారుతున్న సోఫాలూ, ప్రతి ద్వారానికీ నీలంరంగు తెరలూ, చూడగానే గోవిందం బిత్తరపోయాడు. పుట్టి బుద్ధి ఎరిగి ఒక ధనికుల ఇంట్లో అడుగుపెట్టటం అదే మొదటిసారి.

ఇంటి యజమానురాలు గబగబా వచ్చి రంగాచారిదగ్గరనుంచి నెక్‌లెస్ తీసుకుని ఒకసారి అటూ ఒకసారి ఇటూ తిప్పి ఎగాదిగా పరీక్షచేసింది. బాగుందంటే యజమానురాలి హోదాకి భంగం వస్తుందని కాబోలు "ఈరాయి ఇక్కడవుంటే బాగుండేదేమో" "ఇక్కడ కొంచెం మెరుగు తక్కువగా వుందేమో" "ఈ మోస్తరు ఇల్లా కాకుండా అట్లావుంటే బాగుండేదేమో" అంటూ అర్థంలేని అభిప్రాయాలు వెల్లడించింది. రంగాచారి దేనికీ అడ్డుచెప్పకుండా చిత్తం చిత్తం అంటూ ఆవిడ అన్నమాటలకి తాళం వేశాడు. అతని వినయానికి మనసులో సంతోషిస్తూ ఇంటి యజమానురాలు మృదుస్వరంతో "అమ్మాయ్ శంపా! ఇదుగో నీ నెక్‌లేస్ తీసుకొచ్చాడు. వచ్చి చూసి వెళ్ళు" అని కేక పెట్టింది.

పిలవగానే శంప లోపలినించి వచ్చింది. ద్వారందగ్గర వేళ్లాడుతున్న నీలపుతెర చేత్తో తొలగిస్తూ సంకోచిస్తూ తల వంచుకుని నిలబడింది. చూసీ చూడటంతోటే ఆ యువతి నీలిమబ్బులలో తళుక్కున మెరిసే శంపాలత లాగా కనిపించి రంగాచారికళ్ళు జిగేలుమన్నయ్. నీల సరోవరసలిలంలో వికసించి విలాసంగా తేలే పద్మంలాగా ఆ యువతి అరక్షణంలో రంగాచారిని మంత్రముగ్ధుణ్ని చేసింది. ఆమెఅణువణువులోనూ నవయౌవనం తొణికిసలాడుతుంది. తడి ఆరబెట్టుకోటానికి విరబోసుకున్న చీకటింటి జుట్టూ, మత్తెక్కించే చూపులూ, విశాల ఫాలభాగాన నక్షత్రంలాగా మెరిసే తీర్చిదిద్దిన తిలకమూ, పండిన దొండపండులాంటి పెదవులూ, బాతుమెడలాగా నాజూకుగా విలాసంగా వున్న మెడఅందమూ, ఆమె లావణ్యాన్ని అరచాటుగా దాస్తున్న దుస్తుల సింగారమూ—ఆమె తారుణ్యం మత్తుమందులాగా వుంది.

ఆవిడచేతులోంచి శంప విలాసంగా నెక్‌లేస్ అందుకుంది. ఎదుట పరాయి పురుషులున్నారని గమనించిందో లేదో. గమనించినా ఈ క్షుద్రులముందు సిగ్గుపడటం తన గొప్పతనానికి లోపమనుకుందేమో. ఎవరూ కోరకుండగానే నిస్సంకోచంగా నెక్‌లేస్‌ని మెళ్ళో అలంకరించుకుని ఆనంద పారవశ్యంలో జారిపోయిన పమిట సర్దుకోటం మరిచిపోయింది. సభ్యతసంగతి కూడా చూసుకోలేదు.

యువకుడు గోవిందం ఆ యువతిఅద్భుత సౌందర్యానికి చకితుడైపోయి వొళ్లంతా కళ్లుచేసుకుని రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. అతని రక్తం అగ్నిధారలాగా నరనరాలలోనూ నాట్యం చేసింది. ఆమె సౌందర్యసుధని పరవశుడై పంచేంద్రియాలతోనూ ఆస్వాదిస్తూ కూచుండిపోయాడు.

రంగాచారి అరక్షణంలో పడ్డా, తేరుకొనిపోయినా ఈ అపూర్వసౌందర్యప్రభావానికి తట్టుకోలేక తలకిందులైపోతున్నాడు. ఈ నిపాతంతో అతని తల తిరిగిపోయి అంతా అయోమయమైపోతోంది. శంపముఖంకేసి చూడగానే అతనికి తన ఇంట్లో ఆడవాళ్లంతా తలుపుకొచ్చారు. వాళ్ళంతా కురూపులు, కరిముద్దులు. ఒక్కళ్లముఖానన్నా కళకాంతులు లేవు. ఈ యువతితో పోలిస్తే వాళ్లంతా రాక్షసులు. ఈ దేవిమూర్తి విశ్వంలోని యౌవనలావణ్యానికంతకీ ప్రతినిధిలాగా కనిపించింది. ఈ సుందరిని చూశాక వాళ్లని తలుచుకుంటేనే వొంటిమీద గొంగళిపురుగులు పాకినట్లుగా వుంది. తనివి తీరని కోరికతో శంపకి కళ్లు అప్పగించి పదిహేడేళ్ల గోవిందంతోపాటు అరవైయేళ్ల రంగాచారికూడా కూచుండిపోయాడు కొయ్యలాగా.

ఆ తరుణి కంఠాన్ని అలంకరించానన్న గర్వంతో నెక్‌లేస్ ధగధగ మెరిసిపోతోంది. రత్నాలతో రవ్వలతోనూ మెరిసే ఈ ఆభరణానికి ఇంతకంటె మంచి ఆశ్రయం ఎక్కడ దొరుకుతుంది? అని రంగాచారి ఆశ్చర్యంతో అనుకోసాగాడు.

ఆ త్రిభువనసుందరికంఠాన్ని అలంకరించే అదృష్టాన్ని సంపాదించిన ఆ నెక్‌లెసూ దాన్ని తయారుచేసిన తనూ ఆ క్షణంలో ధన్యులైనట్లు, తరించినట్లు రంగాచారి అనుకొని పొంగిపోయాడు.

ఇంతలో శంప రంగాచారిముందుకు వొచ్చి విలాసంగా నిలబడి తన రెండుచేతులనీ మెడమీదికి ఎత్తి "చూడండీ ఆచారిగారూ ఈ కొక్కెం సరిగా పట్టటంలేదు" అని ఫిర్యాదుచేసే కంఠస్వరంతో అన్నది.

రంగాచారి ఉలిక్కిపడి లేచాడు. అంతసేపూ తివాచీమీద మంత్రముగ్ధుడిలాగా కూచున్నవాడు శంపకంఠస్వరం వినగానే

త్రుళ్లిపడి చివాలున లేచి నిలబడి "ఏదండీ, కొంచెం సరిచేస్తాను" అంటూ శంప వెనక్కి వెళ్లాడు. గోవిందం ఆ యువతి అంత దగ్గరగా వచ్చి నిలబడేసరికి విస్మితుడైపోయాడు. స్వర్గం కనుచూపుమేరలో మెరిసినట్లనిపించింది.

"ఏం ఇంకా సరిచెయ్యటం కాలేదా? ఇంకెంతసేపు? ఆ పతీ నెక్లేస్ చేసింది మీరేనా? అయితే కాస్త ఆ కొక్కెం సరిచేసుకుటానికి ఇంతసేపా?" అంది చిరునవ్వుతో కొంచెం చిరాకుని సూచిస్తూ.

"ఇదిగో, సరిచేశానులెండి. కొత్తది కనక కొంచెం బెట్టుగా వుంది. వాడుతూ వుంటే అదే సరిపోతుందిలెండి" అంటూ వచ్చి మళ్ళీ తివాచీమీద చతికిలపడ్డాడు రంగాచారి.

ముసిముసినవ్వులు వెదజల్లుతూ శంప తూలికలాగా ఇంటిలోపలికి దూసుకుపోయింది.

నీలపు తెరమరుగున చరాలున పోతున్న శంపకేసి గోవిందం రెప్పవాల్చకుండా చూస్తూ తివాచీకి అతుక్కుపోయాడు. శంప లోపలికి వెళ్లినా ఆమె లావణ్యతరంగాలు ఇల్లంతా తాండవిస్తున్నట్లనిపించింది. ఆమె దరహాసమాధుర్యం, ఆమె కోకిలస్వరం అతని హృదయం మూలమూలలా మారుమోగుతున్నయ్.

తన గదిలోకి పోయి నిలువుటద్దంముందు నిలబడి శంప నెక్లేస్‌ని పరీక్షగా చూసుకుంది. ఆ నగ తనకి తగినదో కాదో అని ఎగాదిగా చూసింది.

రెండు నిమిషాల్లో మళ్ళీ హాలులోకి తిరిగివచ్చి "చూడండి ఆచార్లుగారూ! ఇక్కడ ఈ ఎర్రరాయి కొంచెం మోటుగా వుందండీ. అది మార్చి మెరుగుపెట్టి మళ్ళీ రేపు పంపించండి" అని రంగాచారి ముందుకి వెళ్ళి నిలబడింది. రంగాచారి మళ్ళీ లేచి నుల్చొని ఆ కొక్కెం వూడదీసి ఆభరణాన్ని ఇవతలకి తీశాడు. మర్యాదప్రకారం సెలవు పుచ్చుకుని ఆచార్లు గోవిందంతోసహా ఇంటిదారి పట్టాడు.

గోవిందం ముందూ రంగాచారి వెనకా నడుస్తున్నారు. ఎవరూ నోరు కదపటం లేదు. ముక్కాకలు తీరిన ముదుసలి రంగాచారీ; దుడుకుయౌవనం పొంగుతున్న గోవిందం ఇద్దరూ వేరొక భావప్రపంచంలోకి రెక్కలు సాచి ఎగిరిపోతున్నారు.

కొంతసేపున్నాక "ఒరేయ్ గోవిందం!" అన్నాడు రంగాచారి. గోవిందం అదిరిపడి "ఏమిటి బాబుగారూ?" అన్నాడు. రంగాచారి నెక్లేస్ పెట్టె గోవిందంచేతి కిచ్చి "ఒరేయ్ ఈ నింకో ఇంటి కెళ్ళి ఇప్పుడే వొస్తాను. నువ్వు సూటిగా ఇంటికిపో. వస్తువు జాగర్త. ప్రాణంతో సమానం" గోవిందం "అల్లాగేనండి" అంటూ రంగాచారి చూపుమేరదాటగానే ఆ పెట్టెని ఒకసారి ముద్దుపెట్టుకుని గుండెకి అదుముకున్నాడు. పూర్ణిమనాటి సాగరంలాగా అతని హృదయం పరవళ్ళుతొక్కసాగింది.

కొంతదూరం వెళ్లేసరికి ఒక మామిడితోపు వచ్చింది. ఒక చెట్టుకింద చతికిలపడ్డాడు. ఒక్కసారి పెట్టె మూతతీసి ఆ యువతికరస్పర్శతో ధన్యమైన ఆ ఆభరణాన్ని చేతుల్లో నిమిరితే ఎంతో బాగుంటుంది! ఈ కోరిక గోవిందం కాళ్లకి బంధాలువేసింది. చివరికి వొణుకుతున్న చేతులతో పెట్టెమూత తెరిచి చూసేసరికి గుండె గుభేలుమన్నది. లోపల ఏముంది? నెక్లెస్ ఏమైపోయింది? పిచ్చెక్కినవాడిలాగా మూలమూలలా గాలించివేశాడు. ఎంత వెదికినా లాభం లేకపోయినది. ఒక్కసారిగా కళ్ళముందు కారుచీకట్లు కమ్మినట్లయింది. ఎక్కడికి పోవాలి? ఏం చేయాలి? ఏముఖం పెట్టుకుని గుమ్మం కాడికి వెళ్ళాలి? ఏమీ పాలుపోక అక్కడే బడి పోయాడు.

ఇంతలో రంగాచారి ఇంటికి చేన్నాడు. కాని అంతవరకూ గోవిందం కనబడలేదు. ఇంకాకే ఇంటికి చేరుకొనినవాడు ఇంతవరకూ ఏం చేస్తున్నాడి. గంటలు గడచిపోతున్నయ్ కాని గోవిందం జాడ కనబడటం లేదు. అంతరిక్షే ఆందోళనా, విసుగూదు, కోపం ఎక్కువైనాయ్. కోపంతో రంగాచారి తం[illegible] పళ్లు పటపట కొరుకుతూ అగ్గిరాముడై "ఇంకేం చేస్తాడు? ఆ దొంగముండాకొ[illegible] దొరికిందే పండబెట్టి వుడాయించాడు కాబోలు అని వెంటనే పోలీసుకి రిపోర్టు చేశాడు.

ఊరంతా గాలించేసరికి మామిడితోపు[illegible] గోవిందం దొరికాడు. చేతుల్లో నెక్[illegible] పెట్టెపట్టుకొని. మాటామాట అనకుండా తన్నుతూ నడుము లాఠీతో పొడుస్తూ గోవిందాన్ని స్టేషనుకి లాక్కుపోయారు.

వారం రోజుల తరవాత విచారణ జరిగింది. రంగాచారి చెప్పిన సాక్ష్యంబట్టి గోవిందానికి రెండేళ్ళ కఠినశిక్ష పడింది. గోవిందం తను నిర్దోషినని చెప్పుకో[illegible]

(19-వ పేజీ చూడుడు)

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

౪౧

"శ్రీరాష్ట్రా వసుమత్కీర్తిర్వరభుజా
స్తంభే గగన్మండల
ప్రాసాదస్థిరభారభాజి దధతీ
సా సాలభంజీశ్రియమ్
పండాలోత్తనుగండభిత్తిషు మద
వ్యాసంగవశ్యాత్మనామ్
యాముత్తేజయతేతరాం మధులిహా
మానందసాంద్రా స్థితిః

తిక్కనామాత్యుడు.

పశ్చిమగోదావరీతీరమున శ్రీరుద్రదేవమహారాజు ఐదు దినము లుండెను. ప్రతిదినము గొంటూరునుండియు మోసలపురమునుండియు రాకలసిన వార్తల కామె నిరీక్షించుచుండెనుగాని యవి రాలేదు.

మహారాజు లక్కడ విడిసియున్న వార్త చుట్టుపట్టుల శీఘ్రముగా వ్యాపించెను. పలువురు సామంతులును పెద్దలును ప్రజలును రాజదర్శనమునకై శిబిరమున మూగసాగిరి. వారు చెప్పుకొనుచున్న కష్టసుఖములన్నియు మహారాజాలకించెను. దుష్టులగు పలువురు ప్రభువుల నామె తొలగించి యా యధికారములు క్రొత్తవారికిచ్చెను. కాలువలు చెరువులు తోటలు వనములు రేవులు ఇత్యాదులగు నెన్నియో విషయములు విచారించి యుక్తములగు నాజ్ఞలు ప్రవర్తింపజేసెను. మహారాజులను ప్రజలు వేనోళ్ల పొగడుచు సెలవు తీసికొనుచుండిరి.

అన్నిటికంటె నెక్కువగా నా చుట్టుపట్టుల గ్రామకరణములు ప్రజానీకమును పెట్టుచున్న బాధలు మహారాజుల కవగతములయ్యెను. ప్రజానీకమే కాదు. జన్నిగ తన సేనాచలనమునకు గొంటూరువైపులనుండి నరసాపురమునకు వచ్చుచుండ వారు కల్పించిన యిక్కట్లు నివేదించుకొనెను. ఎదురుగా వారేమియు జేయరు; వినయవిధేయతలతో ప్రవర్తింతురు. చాటునకు పోయి గ్రామీణుల బెదరింతురు. ఎప్పుడో వచ్చి వెంటనే పోవు మహాప్రభువులపైకంటె నిత్యసన్నిహితులైన గ్రామాధికారులన్న ప్రజల కెక్కువ భయము!

కాని యింతమంది కరణములను ఒక్కసారి తొలగించుటెట్లు? తొలగించిన వ్యవహారము సాగుటెట్లు? రుద్రమ తీవ్రముగా నాలోచించెను. గ్రామవ్యవహారపత్రములన్నియు నికముందు గ్రామపాలకులగు రెడ్ల గృహములందే ఉండునట్లు కట్టడిచేసి, ప్రతిగ్రామమునకును వెనుకనున్న కరణమునకు తోడుగా త్వరలో మరియొక కరణమునుగూడ నియమింతుమని సెలవిచ్చిరి. రెడ్లును కరణములతో నెన్నియో బాధలు పడుచున్నందున దీనికి వారును సంతోషముతో నంగీకరించిరి. ఓరుగల్లు చేరినవెంటనే కరణపాఠశాలలో చేర్చుకొనుచున్నవారిలో నిక్కడికి వచ్చుటకు ఇష్టమున్నవారిని, తోడి కరణములుగా నియమింపవలెనని రుద్రమహారాజు లుద్దేశించిరి. ఈ యాజ్ఞలు గొంటూరునుండి దక్షవాటివరకును ప్రవర్తింపజేయ నుద్దేశించెను.

ఆ పుష్యమాసపు వెన్నెలరాత్రు లామె యచ్చట గడపెను. కాని యవి యేమాత్రమును ఆమె హృదయతాపము నుపశమింపలేకపోయెను.

కృష్ణపక్షమున విదియనాడు ఆమె దక్షారామమునకు బయలుదేరెను. దారిపొడుగునను, మహారాజులయొద్దకు వచ్చి కష్టసుఖములు నివేదించుకొను పెద్దలను పిన్నలను చూచుచు వారితో సంభాషించుచుండుటతో రుద్రమ్మకు రాత్రింబవళ్లు తీరికలేదు. మహారాజులకును ప్రజలకును పరస్పరానుబంధము దృఢమయ్యెను. ఈ నూతనానుబంధములు ఆమెహృదయమున నొక విచిత్రమగు తృప్తిని శాంతిని కలిగించుచుండెను.

అట్లు పది దినములు ప్రయాణములు చేసి, యామె దక్షవాటి చేరికొనెను. అనాటి సాయంత్రమే రుద్రమ భీమేశ్వరుని సందర్శించెను. ఆ మహాలింగమును చూచినవెంటనే రుద్రమకు తన తండ్రిని దర్శించినట్లే యానందము కలిగెను. అతడు ఆంధ్రరాజులకు ఇష్టదైవము. చాళుక్యులకు ఇలువేల్పు. తాను కాకతిరుద్రమ్మయయ్యు, చాళుక్యుల ఇల్లు మెట్టినది. చాళుక్యుల ఇలువేల్పు తనకును ఇలువేల్పే!

ఆమె యా మహాదేవున కేమి నివేదించుకొనదలంచెనో! పూర్వము తానక్కడికి వచ్చినప్పుడు తన ప్రక్కను వీరభద్రేశ్వరులుండిరి. అక్కడ పూజచేయు శివద్విజుడు పూజాసంకల్పమున సపత్నీకులగు వీరభద్రేశ్వరుల నామమే చెప్పి పూజచేసెను. ఇప్పుడెట్లు జరుగవలెను!

స్థానికుడగు శివద్విజునకు ఈ సందేహమే కలిగెను కొట్టి పూజాసంకల్పము ప్రారంభించి దేశకాలసంకీర్తన మొనరించి యజ

మాననాను చెప్పబోవుచు తలయెత్తెను. వెంటనే అచ్చట నున్న రాజపురోహితుడు శ్రీరుద్రదేవమహారాజనామ మందిచ్చెను. పూజ సాగిపోయినదిగాని రుద్రమమన సెక్కడిదో భయమైన ట్లున్నది. ఆమె కన్నులు చెమ్మగిల్లినవా ! సమీపవర్తుల కనుమానము కలిగినది. భక్తిచే కలిగిన సాత్త్వికభావమని సరిపెట్టుకొనిరి. వారేమియు ననలేదు. ఏమందురు ! పూజావసానమున మహారాజు తీర్థప్రసాదములు గ్రహించి పుష్కలదక్షిణ లొసంగి భూసురాశీర్వాదము లొంది పరధ్యానముగా తన శిబిరమునకు వెడలిపోయెను.

అక్కడికి చేరునప్పటికి ఆమెకు రెండు శుభవార్తలు తెలిసినవి !

జన్నిగ పంపిన భూసేనలు మోసలపుర మైదుదినములు ముట్టడించినవి. మోటుపల్లి నుండి త్రిపురాంతకుడు పంపిన నావలును మోసలపట్టణమురేవును అవరోధించెను; ఐదవనాటి కక్కడికి కొప్పెరుంజింగడు వరసాపురమునొద్ద పరాజయము నొంది జన్నిగకు పట్టుబడినవార్త చేరెను. అందుపై ద్విగుణోత్సాహముతో కాకతీయ సేనలు రెండును మోసలపట్టణముపై విజృంభించెను. అక్కడ నున్న కొప్పెరుంజింగని సేనాని లొంగిపోయెను. చోళనావలు చిక్కినవి చిక్కియు, మునిగినవి మునిగియు, పోగా మిగిలినవి శిథిలావస్థలో పారిపోయెను. మరల నవి యంధ్రసముద్రతీరభూమిని అలజడి చేయలేవు !

రెండవశుభవార్త గొంటూరునుండి వచ్చిన విజయవార్త ! ఎంతకాలమో యుద్ధము చేసినగాని సాధింపరాని దుష్కరకార్యమును అంబదేవుడు తన సూక్ష్మబుద్ధితో సులభముగను శీఘ్రముగను సాధించెను. అతనికి అదృష్టముకూడ కలసివచ్చినది. పరస్పరసమాలోచనములకు పలువురు రహస్యముగా గొంటూరులో సమావేశమై యున్నతరి నిరీక్షించి, సరిగా నప్పుడె యాకస్మికముగా నంబదేవుడు గొంటూరుపై మహాసేనతో పడెను. ఎట్టి ప్రయాస లేకుండ గొంటూరు నతడు పట్టుకొనగల్గెను. అచ్చటి ప్రభువగు నాగదేవుడు యుద్ధములో ప్రాణములు గోల్పోయెను. ఆ చుట్టుపట్టుల నుండి యచ్చట సమావిష్టులై యున్న తెలుగుచోడప్రభువు లెందరు పట్టుపడిరి. ఎఱుసమల్లిచోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మల్లికార్జునుడు, దామోదరుడు—వీరందరును చిక్కిరి. వారి నామాంకితము లగు జన్మపత్రములుగూడ అంబదేవు డావార్తతో పంపెను. విజయదశమినాడు ఓరుగల్లుచెరసాలనుండి తప్పించుకొనిపోయిన బొల్లడను మైలారుభటుడును చిక్కిపోయెను.

ఈ శుభవార్తలు తెలిసి వెంటనే వానిని రుద్రమ్మ తన శిబిరమునను దక్షారామమునను ఆ చుట్టుపట్టులను చాటింపబంచి, ఐదురోజు లుత్సవము ప్రకటించెను. దక్షారామపరిసరప్రజ లారాత్రి నిదురింపబోవుసమయమున సరిగా, శ్రీరుద్రదేవమహారాజులు గొంటూరు మోసలపట్టణముల జయించిన ఘోష ఆలకించిరి.

ఆ చాటింపు అవల జరుగుచునేయుండెను. ఆ శబ్ద మొకప్రక్కనుండి చెవుల బడుచునే యుండెను. ఆ సమయముననే ఓరుగల్లునుండి వేగరులు వచ్చి వార్తాపత్రములు మహారాజుల కందిచ్చిరి. విప్పి చూచుకొన నందు ముఖ్యమైనది రుయ్యమ్మస్వహస్తలిఖితమై యుండెను. ఆ వార్తల సారమిట్లుండెను :

"శ్రేష్ఠులును పూజ్యులు నగు మహాప్రధానులు శ్రీమద్గోవిందనాయకుడును బయ్యనినాయకుడును వారి పదవులనుండి విరమించుకొనిరి. మహారాజులు రాజధానిని వదలియున్నతరుణమున రు నచ్చట రాజప్రతినిధిగా నిలిపిపోవుట వారికి సమ్మతముగా ను తోచదు. మరియు పట్టణములో అలజడు లెక్కువగా ను భిన్నమతస్థుల పరస్పరకలహములు వారించుట కష్టతరముగా న అందులో నొకరిది న్యాయమని నిర్ణయించినచో, ఎదిరివా రది పాత మని నిందించుచున్నారు. జైనవసతిలో మహాశివరాత్రికి నాథప్రతిష్ఠ చేయ సంకల్పించి రాజకోశమునుండి ధనము లిప్పింప నర్థించినారు. ఆగ్నేయమునుండి చోళప్రభువును నుండి హొయిసలబల్లాలరాజును మన రాజ్యముపై దం రానున్నా రని వార్తపై వార్త వచ్చుచున్నది. దేవగిరి మాత్రము పరమశాంతముగా నున్నది. ఆ యాదవప్రభువు నెత్తిరా నున్న దేహము ప్రభువుల నెదుర్కొన నుత్తరముగ లతో సాగిపోయెను. కరణపాఠశాలలో చేరిన యారువే బ్రాహ్మణులును గ్రామసవృత్తిలో నారి చేరిరి..."

రుద్రమ్మకు చివరివార్తకు చిరునవ్వు వచ్చెను. తన మే కూతురగు నీ బ్రాహ్మణకన్యకు ఎంత బ్రాహ్మణాభిమానము ! దీనికి ప్రియుడును పూజ్యుడును సాక్షాద్భగవత్తుల్యుడును, అగు మంత్రిని ఏమిచేసినదియు నిది వ్రాయలేదు. అది యాతని విడి యుండదు. ఆ మహాత్ముడు నిర్దోషియని మనుమసిద్ధివల నిరూపింపబడునో, లేదో ! కాకతి సామ్రాజ్యమును ధ్వంసము బూనిన మనుమసిద్ధి చెప్పునది నమ్ముటెట్లు ! అతనికి కొప్పెరుంజింగనిపై నున్న ద్వేషముచే నీ యుద్ధములో పాల్గొన్నంతమున నాతని నమ్మవచ్చునా ! ఇతడు అంబదేవుని సేనలో ఇంత యున్నతపదవి, తన పేరు చెప్పకొనకుండ ఎట్లు సాధిం కేతనమాటలచే నా 'పాలవీరుడు' మనుమసిద్ధి యను సందే తోచినవెంటనే, రుద్రమ యా యోధుని స్వాతంత్ర్యము నిరో సేనాపతిత్వము తొలగించి, భటుల కాపులో నుంచెను. తాను పని నిస్సందేహముగా నుత్తమమైనది.

అంతలో నేదో యాశాకిరణము రుద్రమ్మతలపులో భాసిల్లుచున్నది. వెంటనే భటుని బిలిచి 'పాలవీరు'ని తన సని తెమ్మని యాజ్ఞాపించెను. భటులు 'పాలవీరుని' బంధించి రు ఎదుట నిలిపిరి.

'పాలవీరుడు' స్వస్థుడై యుండెను. కాని యాతని కి బలము పట్టలేదు. ఆతనికి ముప్పదియైదేండ్లకంటె వయస్సున లేదు. ఆతని దేహమునం దెల్ల బాహువులు ఒక విశిష్టసంప నలరారుచున్నవి. అవి రెండు కోడెత్రాచులవలె బలమై శ న్నమై యుండి, ఇతడు మహాబాహువు అని చూడగనే అనిపించుచుండెను. అతని యాకారమును ముఖమును మిక్కిలి మనోజ్ఞమై కన్నులు బహు విశాలమైనవి, కాని యాతని చూపులో కొం జంకో, లౌల్యమో, చాపల్యమో,— ఏదో లోప మున్నది, నిది యని వర్ణింపదరముకాదు !

రుద్రమ్మ ఎదుట నిలువబెట్టగనే పాలవీరుడు తల వ కొనెను. అతడు రుద్రదేవమహారాజును కన్నెత్తి చూడకయే యాజానుబాహువులు రెండును ఒక్కమారు పైకెత్తి శిరమున యించి నమస్కరించెను. ఆ బాహువులు రెండు కరికరములవలె కలసికొని శోభ కూర్చెను. రక్షకులను పొంచని మహా

(31-వ పేజీ చూడుడు)



# పంజర విముక్తి



శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

నారాయణ జైలునుంచి విడుదలయి, సరా సరి మామగారు, మేనమామ అగు రామ సుబ్బయ్యగారి పురుకు వచ్చాడు. మాసిన తలకాయతో, చిక్కిన శరీరంతో చాలా మారిపోయినట్లు కనిపిస్తున్నాడు. నారాయణ విప్లవదగహోనవనారవిందుడై, ఉదయంవేళ వీధిఅరుగుమీద కూర్చొనియున్న మామగారిని దూరంనించి చూచి లోలోపల సంతోషించేడు. రామసుబ్బయ్యకూడా నారాయణఇంటివద్దకు రాగానే గుర్తించి 'ఏం? విడుదలచేశారా ఏమిటి?' అన్నాడు. 'అవును.' అని నారాయణ సరాసరి లోనికి వెళ్ళాడు. భార్య శకుంతల, అయిదేళ్ళ కుమారుడు అరుణకుమార్ నారాయణను చూచీ చూడగానే పరమానందభరితులయారు. అరుణ 'నాన్న, నాన్న!' అంటూ దగ్గరికి వచ్చాడు. శకుంతల 18 మాసముల నుండీ భరిస్తున్న విప్రయోగ వేదనాపూరిత నయనద్వయంతో ఆప్యాయంగా భర్తను తిలకించి 'మిమ్మల్ని ఎలా విడుదల చేశారు?' అని అడిగింది.

'నేనింకా జైల్లోనే ఉండాలని నీ ఉద్దేశ్యం కాబోలు: నేను కమ్యూనిస్టుపార్టీ నుంచి రాజీనామా పెట్టాను. పెద్ద అధికారులకు హామీపత్రం రాసిచ్చాను. దానిమీదట ప్రభుత్వంవారు నన్ను విడుదల చేశారు!' అన్నాడు నారాయణ. అప్పుడే లోనికి వచ్చిన రామసుబ్బయ్య నారాయణ మాటలు విని 'నీవు హామీ రాసిచ్చి వచ్చావు సరే! ఇకనైనా సరిగా నుంటావుగా! బి. యే. పాసయావు. నీ పేరైన ఉద్యోగంచేసి డబ్బు సంపాయిస్తావనుకున్నాను కాని యిలా దేశసేవ చేయడానికి పూనుకుంటావనుకోలేదు. నీ పెళ్ళికిముందు నీ జాతకంచూచిన జ్యోతిష్కుడు మాటమాత్రం నీ భవిష్యత్తిలా వుంటుందని చెప్పివుంటే, నా కూతుర్ని నీకిచ్చి పెళ్లి చేయకుండా ఉండేవాడ్ని!' అన్నాడు.

ఆ మాటలు విని నారాయణ మౌనం దాల్చాడు. కమ్యూనిస్టయినవాడు, అలా మౌనందాల్చి యుండటం అపూర్వవిషయం. శకుంతల భర్తకు కాఫీ యిచ్చి, వేడినీళ్ళు స్నానానికి తోడింది. నారాయణ స్నానంచేసి నూత్నవస్త్రాలు ధరించి ఒక కుర్చీలో కూర్చున్నాడు. అల్లుడు తన మాటలకు సమాధానం చెప్పకపోవడంవలన రామసుబ్బయ్య ఎలా ఆశ్చర్యపోయి మరల సంభాషణ ప్రారంభించాడు. 'శుభ్రంగా నీవు కాంగ్రెసులో చేరి పని చేస్తే నీకు పంచాయతీబోర్డుప్రెసిడెంటు పదవిని నేనిప్పించగలను!' అన్నాడు రామసుబ్బయ్య.

'ఆ బ్రిటిష్‌వాళ్లు తెలివితక్కువగా యీ దేశానికి స్వరాజ్యం యిచ్చి పోయారు. అందులో అది కాంగ్రెసువారిచేతిలోపెట్టి పోయారు. ఈ కాంగ్రెసువాళ్లకేమి తెలుసు పరిపాలన? బ్రిటిషువాళ్లే దేశం పరిపాలించారు కాబట్టే, నగరాలమీద రైలుమార్గాలేర్పడినయి. ఏదీ - మనవాళ్లనొక్కవంతెన కట్టమనుచూదాం! వాళ్లు రోడ్లు వేసారు. ఎంతో ఔదార్యంతో ఈదేశాన్ని పరిపాలించి ఈ అడివిజాతులకు విజ్ఞానం ప్రసాదించారు. ప్రపంచమంటే ఏమిటో తెలియని కూపస్థమండూకాలైన భారతీయుల్ని వెలుగుమార్గాలలోకి తీసుకవెళ్లారు. ఇక యీ కాంగ్రెసువాళ్లు పదవీవ్యామోహంతో పాడయిపోయారు. దేశం ఆర్థికంగా చాలా హీనస్థితిలోవుంది. ప్రజల కాహారం, వస్త్రం, విద్యాసౌకర్యాలు లేక చెట్లమీది పక్షుల్లాగ జీవిస్తున్నారు. బ్రిటిషువారు భారతదేశాన్ని బానిసదేశం చేసి దోచుక తిన్నారంటారే గాని, వాళ్లు మనదేశానికి చేసిన మేలు మనం యుగయుగాలవరకు మరచిపోవలసింది కాదు.' అన్నాడు నారాయణ!

'నీవు సామ్రాజ్యవాదిలాగున మాట్లాడుతున్నావు. కమ్యూనిజం వదిలి సామ్రాజ్యవాదం స్వీకరించావా ఏమిటి?' అన్నాడు రామసుబ్బయ్య.

'యథార్థం మాట్లాడుతున్నాను. ఈ కాంగ్రెసుప్రభుత్వం ఉదాత్తమార్గాలలో నడవటంలేదు. అగ్రనాయకులంతా మనదేశం అమెరికా, రష్యావంటి గొప్పదేశం అని భావించడమేగాని మనదేశం అబిసీనియా స్థాయిలోనుందంటే అందులో అతిశయోక్తి ఏమీ లేదు. ఇక్కడ ప్రకాశవంతుడికి స్థానంలేదు. రాజకీయవిజ్ఞానమున్న వాడికి స్థానంలేదు. విప్లవభావాలున్న వాడికి విలువ లేదు!' అన్నాడు నారాయణ ఉద్రేకంతో నిట్టూర్పుతో—

'కమ్యూనిస్టుపార్టీలో రాజీనామా పెట్టావన్నావు! ఇంకా విప్లవభావాలు మరిచిపోయి అహింసావాదివైతే బాగుపడతావు. ఎందరో కాంగ్రెస్‌వాళ్లు స్వరాజ్యంవచ్చిన తరువాత మేడలు కట్టుకున్నారు. హాయిగా కారుల్లో తిరుగుతున్నారు. నీవు కూడా కాంగ్రెసులో పనిచేయడం ప్రారంభిస్తే త్వరలో మహానాయకుడి వవుతావు. నీ కిదివరకే కావలసినంత రాజకీయపాండిత్యముంది. ఇప్పుడు నువు కాస్త ఖద్దరుకట్టి ఒక గాంధీటోపీపెట్టి బయలుదేరావంటే నీకూరారా బ్రహ్మరథం పడతారు. మంత్రివర్గపు కాంగ్రెసుపార్టీలో చేరావంటే నీపంట పండుతుంది. వాళ్లు నీవిషయములో శ్రద్ధ వహించి నీకేదైనా ఉద్యోగాన్నిప్పిస్తారు!' అన్నాడు మామగారు.

నారాయణకు కోపం వచ్చింది. 'ఉద్యోగం యిస్తే ఎందుకన్నిస్తారు [illegible]! నాకుద్యోగం చేయవలసిన ఖర్మమేంపట్టింది. తీరికగా అడుగుదామనుకున్నాను నా పొలంలో పంటతాలూకు డబ్బు నీ వద్దవున్నది నాకుచాలు!' అన్నాడు నారాయణ.

'నీపొలంలో పంటతాలూకుడబ్బు నీ భార్యయే వాడుకుంటూవున్నది. నిలపటమీ ఇంకా నీవు నాకివ్వవలసిన పెయ్యారూపాయలబాకీ అలాగే వుంది. ప్రోనోటుమీద [illegible] చేసి మరీ ఇచ్చా—నీ వెలాగూ యీపట్లెటూల్లో వుండలేవు. అందులో విప్లవనాయకుడు—యీ అజ్ఞానులమధ్య ఎలా జీవించగలడు! అంటే— నేను నిన్ను వెళ్లమనడం కాదు.

నీయిష్టంవచ్చినన్నాళ్లుండు. నీభార్య, నీ కుమారుడు నీకోసం బెంగపెట్టుకున్నారు! అన్నాడు మామగారు.

నారాయణ కీమాటలు వింతగా వినిపించినయి. తన మూడెకరాలమాగాణిపొలంలో డబ్బంతా ఖర్చయిపోయిందని విని ఆశ్చర్యపోయాడు. ఈవిషయంగూర్చి తనభార్యతో మాట్లాడానికి నిశ్చయించుకున్నాడు.'

బ్రిటిషువాళ్లిండియాను దోచుకోనడం అబద్ధం గాని. నా ఆస్తిపెత్తనం వహించి నీవు నాడబ్బంతా దోచుకున్న మాట సత్యం!' అన్నాడు నారాయణ.

'కాదు. బ్రిటిషువాళ్లు ఇండియాను దోచుకతినడం సత్యంఅని అంటే... అది భావ్యం వుంటుంది. చిన్నప్పుడే నీ తల్లి తండ్రీ మరణిస్తే నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసి, చదువు చెప్పించి, నా కొడుకు కంటే ఎక్కువ ప్రేమతోనిన్ను చూచినందుకు నీవునామీద చూపేగౌరవ మిదేనా? కమ్యూనిస్టుపార్టీలో నుంచి నువురాజీనామా పెట్టినా, నువు కమ్యూనిష్టులాగునసే మాట్లాడుతున్నావు. విడుదల కావటంకోసం రాజీనామా పెట్టావు కాని నీమనసు నిజంగా మారలేదోయ్!' అన్నాడు రామసుబ్బయ్య.

'ఇన్నాళ్ల కతను మళ్లీ ఇంటికి వస్తే... వచ్చినప్పటినుంచీ అతన్ని అలా మాటలంటారేం?' అన్నది వరలత్తుమ్మ, నారాయణ అత్తగారు.

'నే నేమన్నాను? నా కీఆస్తినంతా మనం దోచుకుతిన్నామట! నామీదచూపె గౌరవ మిదేనా? తనపొలంలో పంటతాలూకుడబ్బు తన భార్యవద్ద నే యుంది! వాడికేం తెలుసు? ఎంతసేపూ ఇంటినుంచి డబ్బు తీసుకెళ్లి తగలబెడదామన్న ఆలోచనేగాని, కుదురుగా ఒక ఉద్యోగం చేద్దామని ఉద్దేశ్యం లేదాయె! ఏదో తిరిగి నన్నాళ్లు కమ్యూనిస్టుపార్టీలో తిరిగాడు. అందులో మానుకొని జైలునుంచి బైటపడ్డాడు. ఇకనైనా సన్మార్గంలో పడి సంపాదనాపరుడైతే నాకు సంతోషంగా నుంటుంది' అన్నాడు రామసుబ్బయ్య.

'మీమాటలు నేను వినలేను. నే నిప్పుడే యీ యింటినుంచి వెళ్లిపోతాను!' అని నారాయణ కుర్చీలోనుంచి లేచాడు. అత్తగారు, భార్య, కుమారుడు దుఃఖవదనులై అతన్ని వెళ్ళవద్దని బ్రతిమాలారు. శకుంతల శోకభారంతో కన్నీరు గూడా కార్చింది. రామసుబ్బయ్యముఖమున జాలిపడక ఆ రంగం నుంచి. అవతలికి పోయాడు.

నారాయణను అత్తగారు, భార్యా బ్రతిమాలారు: వాళ్లిద్దరూ ప్రాధేయపడి బ్రతిమాలుతుంటే అతని విప్లవహృదయంలో కనికరం ప్రభవించింది. తానింతకాలంనుంచీ జైల్లో నానాబాధలూ పడి యింటికి వచ్చాడు. తన కాస్తి వుంది. అందమైన భార్యవుంది. ఇల్లుంది. వాకి లుంది. పిల్లవాడున్నాడు. అతను లోలోపల ఆలోచించి తా నుద్రేకంతో లేచిపోతాననడం అతనికి ఓవిధంగా మేలే చేసింది. అత్తగారు మామగారికం చేమంచిది.

'నాయనా! నీకు డబ్బు కావాలంటే మామయ్యచేత యిప్పించే బాధ్యత నాది!' అన్నది. ఆ మాటలు నారాయణకమృతపానంవలె వినిపించాయి. తనుడబ్బులేకుండా ఏంచేయగలడు? ఎక్కడికి పోగలడు? ధనికులైన మిత్రులంతా పట్టుదలతో జైళ్ళలోనే మ్రగ్గుతున్నారు. పార్టీమీద విశ్వాసం రవంతకూడా సడలించక. తానసలు జయిలునుంచి విడుదలైంది దేనికి? పార్టీకి రాజీనామా యిచ్చి, ఉన్నతోద్యోగులకు పూచికత్తు వ్రాసిచ్చి బైటపడింది దేనికోసం?

ఇటువంటి ఆలోచనలతో అతని మనస్సు సముద్రమైంది. ఆ అలల నడుమ అతను చిక్కుకుని తననిర్ణయం మార్చుకుని, నీవూ, శకుంతల అంతగా ప్రాధేయపడి బ్రతిమాలుతున్నారు కాబట్టి ఇక్కడ ఒకవారం ఉండడానికే నిశ్చయించుకున్నాను. నాకెన్నో తొందరపను లున్నాయి! ఆపనులగురించి మీకు తెలిసే మీకర్థంకాదు బైటప్రపంచం తెలియని ధనాశాపరులకు నే నర్థం కావడం కష్టసాధ్యం! కూపస్థమండూకాలవలె యీపల్లెటూరివాతావరణంలో ఏ విధముగాను దేశౌన్నత్యానికి సాయపడకుండా డబ్బులెక్కలు చూసుకుంటూ అదేదో ఘనకార్యమనుకొనేవాళ్లు మానవజన్మ పశుపక్ష్యాదులకంటె హీనం!' అన్నాడు నారాయణ. బైట అరుగుమీద కూర్చున్న రామసుబ్బయ్య కల్లుడు తన నుద్దేశించి అంటున్న మాటలు వినపడినయి. మౌనం దాల్చి వూరుకున్నాడు.

ఆరాత్రి నారాయణ భార్యతో ఏకాంతంగానుండగా పొలంలోడబ్బుగూర్చిఅడిగాడు.

'డబ్బంతానీవద్దనే వుందన్నాడుమీనాన్న. ఎంత ఖర్చయింది? ఇంకెంత వుంది? నాకు అవసరంగా ఐయిదువందలు కావాలి. నేను బొంబాయి వెళ్తున్నాను. అక్కడ ఉద్యోగ ప్రయత్నం చేదామనుకుంటున్నాను!' అన్నాడు నారాయణ భార్యతో.

'మానాన్న మీతో అలా అన్నాడుగాని ఆ డబ్బు లెక్కలన్నీ ఆయనకే తెలుసుగాని ఆడదాన్ని నాకేం తెలుసు? ఆయన, పిల్లవాడి భవిష్యత్తు ఆలోచించి వాడి చదువు నిమిత్తం కొంత నిలువచేసి ఉంచడం మంచిదన్నాడు నాతో...!' అన్నది శకుంతల. నారాయణకు కోపం వచ్చింది. 'మీనాన్న ఇంత అబద్ధాలకోరను కోలేదు. నా పొలం తాలూకు డబ్బు వాడుకోవడానికికూడా నాకు హక్కు లేదన్నమాట! పిల్లవాడి చదువు నేనే చెప్పించుకుంటాను!' అన్నాడు నారాయణ.

(33-వ పేజీ చూడుడు)

ఒక పల్లెవాసి కథనం:

# విశాఖజిల్లాగ్రామాల పరిస్థితి

ఆంధ్ర రాష్ట్రములో విశాఖ జిల్లా అన్ని జిల్లాలకంటె విశాలమైనది. యితరజిల్లాలన్నిటికంటె అన్ని విధాల బాగా వెనుకబడియున్నది. యీ వెనుకబడుటకు అనేక కారణము లున్నవి. నేటివరకు యీ జిల్లా జమీందార్ల ప్రాబల్యములోనున్నది. గవర్నమెంటు ప్రాంతాలకంటె జమీందారుల క్రింద ప్రజలన్ని విషయముల అణచిపెట్టబడినారు. ప్రజలకు కావలసిన కనీససౌకర్యాలు పూర్తిగా ధ్వంసంచేశారు. ఆర్థిక, విద్యాభివృద్ధిసౌకర్యాలు ఏ మాత్రం లేకుండా చేశారు. ఉన్న స్థిరచరాస్తులమ్మి పన్నులు రాబట్టుటలోనే వీరి చాకచక్యమంతా ఉపయోగించారు. అధికంగా పన్నులు వేసి రైతులను విపరీతంగా పీడించారు. పన్నులు రాబట్టుటలో ప్రజలకు విపరీత భయపరిస్థితులు కలుగజేశారు. ప్రజలలో ధైర్యం పూర్తిగా సన్నగిల్లిపోయింది. వారిలో నూతనోత్సాహాన్ని కలుగజేసే ఎట్టివిధమైన సహకారము ప్రజలకందివ్వలేదు. దాదాపు నలుబదిలక్షలు జనాభా కలిగిన యీ జిల్లాకు ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించవలసివుంది.

### గ్రామజీవితము.

పల్లెలలో జీవించే ప్రజలకు పరిశుభ్రతల లోనూ, ఆహారవిహారాదులలోనూ క్రమశిక్షణలేదు. శ్రమించుటలోకూడా ఒక కాల నిర్ణయాన్ని పాటించుట కవకాశములేదు. ప్రకృతిపై ఆధారపడి వర్షము పడినప్పుడల్లా వీరు ఎద్దడిగానే యుందురు. ఏ వృత్తికి సంబంధించిన ప్రజలను చూచినా, బుద్ధి నుపయోగించి పనిచేస్తున్నట్లు కనపడదు. సాంప్రదాయంగా ఒక ఆచారానికి కట్టుబడి నిర్వహిస్తూవుంటారు. సంఘీభావం తక్కువ. కులకట్టుబాట్లకు మూఢాచారములకు ప్రాధాన్యత బాగా యిచ్చెదరు. సంకుచితస్వభావం ఎక్కువ, స్వార్థం మెండు. ఒకరిని ఒకరు వంచన చేసుకొనుటలో నేర్పరులు. ప్రతి గ్రామంలోగూడా నాయకత్వం బహుదుర్మార్గులచేతిలో నడచుచున్నది. అమాయక ప్రజలను వ్యవహారములలో పెట్టి కోర్టుల కెక్కించి పీడించుకతింటూవుంటారు. అనేక చిక్కులలో ప్రజలనైతిక శక్తి, సంస్కృతి వక్రగతి పట్టించినవి. పల్లె ప్రజలకు చదువులన్న భయం జాస్తి. ప్రాథమికవిద్యలో నుత్తీర్ణులై యిప్పుడు గ్రామాల పీడించుకతింటున్నవారిని చూచి విద్యాధికులని వీరి భయం. చదువుకున్నవారు మోసకులనే స్థితికి యీ గ్రామనాయకత్వం ప్రజలను వెనుకకు నడిపించినది. విపరీతమైన భయం వీరిలో పాతుకపోయినది. మోసాన్ని గుర్తించగలరు. కాని ఎదుర్కొనేశక్తిలేదు. ఎదుర్కొంటె ఏమయ్యెదమోననే భయం. కొన్నిపల్లెలలో పాఠశాలలే లేవు. ఉన్న పాఠశాలలుగూడ ప్రజలను ప్రోత్సాహపరచునవిగా లేవు. తాలుకాకు ఒక హైస్కూలు తప్ప వేరే లేవు. మిడిల్‌స్కూల్సుగూడా లేవు. పల్లెలలో పాఠశాలలకు సక్రమమైన కట్టడములులేవు. చాల అనారోగ్యంగానూ, నిరుత్సాహంగానూ ఉంటాయి. యీ ప్రాంతంలో నిర్బంధ విద్యావిధానంగూడా

శ్రీ వంగపండు పారన్న

ఆచరణలో సాధ్యపడుటలేదు. ప్రజలకు ఆర్థికసౌకర్యాలు చాలా తక్కువ. పిల్లలను బడికి పంపితే వారి ఆర్థికస్థితి కుంటుబడే కుటుంబాలు చాలా ఎక్కువ. భూస్వాముల కుటుంబాలు చాలా తక్కువ. అంతా రైతు వర్గమే. యీ రైతులలోకూడా అధిక సంఖ్యాకులకు వారి కుటుంబపోషణకు చాలని ఆదాయం. కొద్దిపాటి ఆవర్ణులలో తప్ప, సామాన్యముగా నూటికి ఎనుబది మందికి ఏ కొద్దో భూవసతి యున్నది. యీ భూవసతి చాలా తక్కువ విస్తీర్ణము. అయిదు ఎకరాలలోపు కుటుంబాలు నూటికి అరువది యున్నవి. వ్యవసాయకూలీలు యీ ప్రాంతమున లేరు. చాలీ చాలని భూవసతి గలిగిన బహు చిన్నరైతులే యితరులకు కూలికిపోయెదరు. వీరికిగల భూవసతులుగూడా సరిగా పండుటకు వీలులేదు. వర్షాధారముపై ఆధారపడునవి. చాలామంది చాలీ చాలని జీవితమున కలవాటుపడి కలో గంజో త్రాగి సంతుష్టి చెందుచున్నారు. విలాసజీవితమే వీరికి తెలియదు. మోటు పద్ధతుల కలవాటు పడిపోయినారు. వీరి ఆచారములు ఆధారకాలలోగూడా మోటుతనము కానవచ్చును.

### పాడి పంట

పాడి చాలా తక్కువ. వీరి ఆహారములో పాడికి అంత ప్రాధాన్యతలేదు. పశుసంపద చాలా తక్కువ వీరి ఆహారములో నెయ్యము చాలా తక్కువ. పాడిపంటలు రైతులకు ముఖ్యమని వీరు మరచారు. పాడివలన కలిగే లాభాలు వీరికి తెలియవు. పాడివలన వచ్చే ఆదాయము కూడా వీరు గుర్తించలేదు. పురాతనంగా వీరికి వచ్చిన భూవసతిపైనే వీరిశక్తిని ఉపయోగించెదరు,

వ్యవసాయవిధానములో గూడా వీరు తాను పడుచున్న కష్టనష్టములు గమనించరు. నీటి వసతిసాధనములు ఏర్పాటు చేసుకొన్న అభివృద్ధిచెందెదమనే భావముచాలా తక్కువ. దైవముమీదే హెచ్చు ఆధారపడెదరు. దైవసహాయము లేకపోతే పంటలు కలరావనే అభిప్రాయము వీరిలో పాతుకపోయినది. ఆధునిక వైజ్ఞానికదృష్టి చాలా తక్కువ. స్వశక్తిపై వీరికి నమ్మకము తక్కువ.

నేడు వ్యవసాయభూములు చిన్న చిన్న ఖండాలుగా భాగించబడియున్నవి. జనసంఖ్య పెరుగుచున్న కొలదీ భూమిని బహు తక్కువ పిలికలుగా చీల్చుకొనుచున్నారు. పురాతన వృత్తులపై ఆధారపడుటే తప్ప ఉపవృత్తులు కూడ చేయుటకు వీరు యిచ్చగించరు. పెద్దలు నిర్ణయించిన వృత్తులు తప్ప అన్యవృత్తులు, కులవృత్తికి వ్యతిరేకమని వీరి భావము. వ్యాపార దృష్టి చాలా తక్కువ. ఏకొద్దిమంది తెలివికలవారో తప్ప సామాన్య కుటుంబస్థులు వృత్తులు కుంటుబడినా యితర వృత్తులు చేయుట కొప్పుకొనరు. కులాల వారీగా ఒకరి వృత్తి యింకొకరికి సాధ్యము గాదనీ, చేయుట నీచమనీ వీరి భావము. కూరగాయలు పండించుట కూడా పాపలవారని, కాయకూరలను, పండ్లను, విక్రయించువారు నచ్చడివారని, వ్యాపారము చేయువారు వైశ్యులనీ, యీవిధంగా ఏ వృత్తి చేయు వారు ఆ వృత్తినే చేయుటకు దేవుడు పుట్టించాడనీ వీరి భావము. వ్యవసాయము చేయు వారిలో జనాభా పెరిగినందున భూవసతి చాలుటలేదు. భూమిపై ఆధారపడి జీవించే

కుటుంబాలలో నూటికి ఏబదిమందికీ వ్యవసాయముపై వచ్చు ఆదాయము చాలదు. క్రనీసజీవనప్రమాణాన్ననుసరించి సక్రమమైన వస్త్రధారణగాని, ఆహారనియముగాని అనుసరించక, కూడబెట్టుటకే హెచ్చుగా ప్రజానీకం తాపత్రయపడుచుందురు. ఎక్కువ కరువు కాటకాలకు గురియగుటవలన వీరికీదృష్టి అలవడినది. కష్టాలను సహించు అలవాటు వీరికి బాగా జీర్ణించిపోయినది. ఎన్ని విధములైన కష్టములు వచ్చి వీరిమీద పడినను భయపడెదరేగాని రోషపడి ప్రతిఘటించుటకు ప్రయత్నించరు. అది సహనభావమూ కాదు. హృదయ దౌర్బల్యమువలన కలిగిన నిర్వీర్యత. విశాలదృక్పథముకాదు. సంకుచిత తత్వములోనుండి వెలుకవచే స్వార్థపరత్వము.

## ఆరోగ్యము

వైద్యసౌకర్యాలు బొత్తిగా తక్కువ. ఎక్కడో ఒకటి తప్ప, గ్రామాదులలో వైద్యాలయాలు లేవు. తాలూకా ముఖ్యపట్టణములో ఒక ఉచిత వైద్యశాల ఉండును. యిది పల్లె ప్రజలకు ఏమీ ఉపయోగపడదు. యిరువది ముప్పది మైళ్లనుండి వైద్యశాలకు వచ్చుటకు రాకపోకల సౌకర్యాలు తక్కువ. అనారోగ్యమునే పల్లెలలో కృశించి యుండెదరు. వారికి సలహా యిచ్చువారైనా యుండరు. ఆరోగ్యమువిషయముకూడా దేవునిపై భారమువేసి వదలిపెట్టెదరు. ఆయువుంటే ఎలాగైనా బ్రతుకుతామనే భావం పాతుకపోయింది. గ్రామాల వీధులు విపరీతమైన మురికితో నిండి యుండును. యిది గ్రామీణప్రజలు అలవాటు క్రింద భావించెదరు. గ్రామాల కట్టడములుకూడా బహు పురాతనములు. వాటిని మార్చుట కిష్టపడరు. యిల్లుమారిన అచ్చుబడి రాదనే మూఢ విశ్వాసము గలదు. పెద్దలు నిర్మించిన యిండ్లలోనే వుండుట మంచిదని వీరి భావము. కుటుంబాలు ఎంత విరివిగా పెరిగినా ఉన్న ఇండ్లలోనే క్రిక్కిరిసి ... [continues] 






## కళలు

వీరు బహుపురాతన కళల కలవడి యున్నారు. పురాతన ఫక్కీలోని భామవేషములు, వీధినాటకములు, జముకుల, హరి హరి నారాయణ మొదలగు పాతవిధానములోని కళలనే అభిలషించెదరు. సినిమాలకు యిప్పుడిప్పుడే అలవడుచున్నారు. పల్లెప్రజలలో అధికసంఖ్యాకులు యింతవరకు సినిమా

అంతే ఎరుగనివారు గలరు. హరికథలు, పాట కచ్చేరి, నృత్యము, మొదలగు లలితకళలు వీరి నాకర్షించలేవు. రైళ్లు, బస్సులు ఎక్కని ప్రజలుగూడా అనేకులు గలరు. అధునాతన నాగరికత వీరిలో ఒక రకమైన ఏహ్యాభావమును పుట్టించును. నాగరికత గలిగిన స్త్రీ పురుషులను చూచి వీరు అసహ్యించుకొందురు. ఆధునిక వైజ్ఞానికాభివృద్ధికి చాలా దూరముగా నున్నందున వీరిలో బహు పురాతనవిధానముతో బాగా పాతుకపోయినవి.

### భాష - సంస్కృతి

వీరి వేషభాషలు బహు సనాతనత్వాన్ని రుజువు చేయును. ఓఢ్ర శబ్దములుకూడా వీరి భాషలో పొడచూపును. యీ జిల్లావాసుల ఆచారములలో చాలా భాగము ఓఢ్ర సాంప్రదాయమును పోలియుండును. ఒకప్పుడు యీ జిల్లాలో చాలాభాగము ఓఢ్రుల పాలనక్రింద యున్నట్లు కనబడుచున్నది. గ్రామకరణాలు యిప్పటికీకూడా పట్నాయికులే యున్నారు. వీరు ఓఢ్రులు. వీరు మాతృ భాషను మరచిపోయిరి. యిచ్చట నివసించే అవర్ణులలో అన్ని తెగలవారుగూడా ఓఢ్రదేశస్థులే. వీరికి మాతృభాషలో ప్రవేశమున్నది. కట్టు ఆచారములుగూడా ఓఢ్రుల ననుసరించియే యుండును. గ్రామదేవతల పండుగలు, బలులు మొదలగునవి మిశ్రమ సంస్కృతినే స్ఫురింపజేయును. అచ్చ తెలుగు చాలా తక్కువ. విద్యాసౌకర్యాలు లేకందున ఆధునికసాహిత్యము వీరిలో జొరబడలేదు. నాగరికత విజ్ఞానములు తక్కువగా యున్నవి.

### రాకపోకలసౌకర్యాలు

ఇంత విశాలమైన జిల్లాలో రహదారి సౌకర్యాలు బొత్తిగాతక్కువ. యిప్పుడున్న రైల్వేసౌకర్యాలుగూడా యీజిల్లాకు సంబంధించినవిగా ఏర్పడలేదు. వివిధరాష్ట్రాలకు ఏర్పడి యున్న రహదార్ల నుద్దేశించి యీజిల్లాలోనుండి ఏర్పాటు చేయబడినవి. ట్రంకురోడ్లుకూడా ఒకటి రెండు ముఖ్యమైన బాటలు తప్ప ప్రజాసౌకర్యము ననుసరించిలేవు. గ్రామాదులలోనుండే ప్రజలకు సౌకర్యములు అసలులేవు. మునిసరుకు రైల్వేలైనుకు చేరవేసేదారులేతప్ప ప్రజలనిమిత్తము ఏర్పరచలేదు. ఒకతాలూకా ముఖ్యపట్టణం కోర్టు తదితర అవసరాలనిమిత్తం ప్రజలుచేరుకోవాలంటే, కొండలు గుట్టలకు అడ్డపడి కాలిబాటలవెంట చేరుకోవలసినదే. గ్రామాలలో పండించే వ్యాపారపంటలు పట్టణాలకు చేరవేయాలంటే బహువ్యయ ప్రయాసలకు లోనుగావలసివచ్చును. దీనివలన శ్రామికవర్గము చాలా నష్టపడుట జరుగుచున్నది. యీ జిల్లాలో రాకపోకలసౌకర్యములు అభివృద్ధి కానందుననే వ్యాపారమభివృద్ధిచెందలేదు. వ్యాపారాభివృద్ధిలేనందుననే అన్నివిధముల వెనుకబడుటకు తోడ్పడుచున్నది. ఆర్థికముగా అభివృద్ధి కవకాశములు తక్కువగానున్నవి. యిచ్చట ప్రజలు నూతనవృత్తులు కల్పించుకొనుట కవకాశములేదు. నేటిపరిస్థితులలో గ్రామాణప్రజలకు వైజ్ఞానికంగా ఏర్పడవలసిన వన్నిహిత తత్వమునకు దెబ్బ తగిలినది.

### తంతి తపాలా సౌకర్యాలు

భారతదేశంలోని మద్రాసురాష్ట్రముతోగాని మిగతా ఆంధ్రజిల్లాలతోగాని పోల్చిచూచుకుంటే యీ జిల్లాలో సౌకర్యాలు పట్టణాలలోతప్ప పల్లెలకు అసలే లేవని చెప్పవచ్చును. తాలూకాలలోని ప్రతి మారుమూల గ్రామాదులకు ఉత్తర ప్రత్యుత్తర సౌకర్యములు లేవు. పల్లెలలో పోస్టాపీసులు పిర్కాకు ఒకటికంటె ఎక్కువగానుండుట చాలా అరుదు. రెండేసి పోస్టాఫీసులకు యిరువది ముప్పది మైళ్ళ దూరముగూడా యుండును. ఒక కార్డుగాని కవరుగాని రెవిన్యూస్టాంపుగాని కావాలంటే పట్టణాలకు వెళ్లి తెచ్చుకొనవలసినదే. వున్న పోస్టాఫీసులలోకూడా స్టాకు తక్కువ. ప్రతిదినము టపాసౌకర్యములుగల గ్రామాదులు చాలా తక్కువ. అత్యవసరసమయాల్లో తంతి చేయవలసివస్తే పట్టణాలకు రావలసిందే. తపాలా సౌకర్యములు తక్కువగుటచే యిక్కడ ప్రజలు ప్రపంచవార్తలకు చాలా దూరముగా యున్నారు. దినపత్రిక కావలసివస్తే పట్టణాలకువచ్చి కొనుక్కొని పోవలసిందే. పత్రికాప్రచారము చాలా తక్కువగా యున్నందున ప్రజలు చాలా వెనుకబడి యున్నారు. పత్రికాపఠనానికి అలవాటు పడాలంటే వారిని ప్రోత్సహించే తపాలా సౌకర్యములు లేవు. రేడియోలు లేవు, అందుచేత ప్రజలలో సహజంగా అభివృద్ధి చెందవలసిన విజ్ఞానాభివృద్ధి కలుగుటలేదు.

### నీటి సౌకర్యాలు

అచ్చటచ్చట ఏ కొద్ది ప్రాంతాలలోనో



వాషింగ్‌టన్ సమీపంలో మేరీలాండ్ విశ్వవిద్యాలయంలో సంయుక్తరాష్ట్రాల భారత రాయబార కార్యాలయంవారు జరిపిన భారత చేతిపరిశ్రమల ప్రదర్శనంలో ప్రేక్షకులు కుతూహలంతో తిలకిస్తున్న కొన్ని వస్తు విశేషాలు.

తప్ప అత్యధిక భాగానికి నీటిసౌకర్యాలు తక్కువ. పూర్తిగా వర్షములమీదనే పంటలు ఆధారపడియున్నవి. యీ జిల్లాలోగూడా చాలినన్ని జలాధారములు గలవు. కాని జమీందార్లు శ్రద్ధవహించలేదు. చెరువులనుగూడా మరమ్మత్తు చేయించక పూడ్చివేశిరి. జులుము చేసి వారి పన్ను తేరాబట్టుకొనిరి గాని వ్యవసాయాభివృద్ధియందు జమీందార్లకు దృష్టి పోలేదు. విదేశీయ ప్రభుత్వం హయాములో గవర్నమెంటు ఏరియాలోగల ప్రాంతాలకు యీ దుస్థితి యింతగా పట్టలేదు. అన్ని సౌకర్యాలు జమిందారీ ప్రాంతాలకంటె ఎక్కువగానే యున్నవి. ప్రస్తుతము యీ జిల్లాలో గల జలాధారములకు చిన్న చిన్న అనకట్టలు కట్టించిన త్వరలో అభివృద్ధి జరగగలదు. పెట్టుబడికూడా చాలా తక్కువగా పట్టును. ఒక్కొక్క అనకట్టక్రింద ఒక తాలూకా మొదలు రెండు మూడు తాలూకాల వరకు నీటిసరఫరా జగగలదు. పెద్ద పెద్ద స్కీములు వేసి డబ్బులేదని వూరుకుండుట కంటె, చిన్న చిన్న మొత్తాలను వెచ్చించి ఆర్థికంగా సౌష్ఠవం పొందటానికి ప్రభుత్వం ప్రయత్నించుట అవసరం. తాత్కాలికాభివృద్ధికని చెరువుల మరమ్మత్తులకు బావుల నిర్మాణానికి వెచ్చించే ధనమును, శాశ్వతపు నాదులు వేయడానికి వినియోగించినచో, నేడు జరుగుచున్న దుబారా తగ్గగలదు. ఆచరణలో నిర్మాణాత్మకమైన అభివృద్ధి ప్రణాళిక వలన కరువు కాటకాలనుండి ప్రజలను రక్షించుకొనవచ్చును.

### సహజస్థితి

విశాలాంధ్రంలో విశాఖజిల్లా తలమానికము కాదగిన అవకాశములున్నవి. భూములు చాలా సారవంతములయినవి. నీటిసదుపాయములు గలుగజేసిన సృష్టిసంపద కాలవాలమై ప్రసిద్ధికి రాగలదు. అన్ని రకములైన ముడిపదార్థములు వ్యాపారపంటలు పండును. యీ జిల్లా ఆర్థికాభివృద్ధి దేశాభివృద్ధికి ఎక్కువ తోడ్పడును. యింత విశాలమైన జిల్లా అన్ని జిల్లాలకంటె హెచ్చు జనాభా కలిగి అవకాశములు లేక చాలా వెనుకబడియున్నది. నీటి సదుపాయములున్న యెడల ఆంధ్రరాష్ట్రమునే కరువు కాటకాలలో భరించగలదు. పరిశ్రమల నెలకొల్పుట కనువైన ప్రదేశం. యిప్పటికే ఆంధ్రజిల్లాలన్నిటికంటె ముఖ్యపరిశ్రమలున్నవి. చెరుకు, నార, వేరుశెనగ బాగా అభివృద్ధికాగల యవకాశము ఉన్నవి. విశాఖపట్టణం ఆంధ్రదేశంలో ముఖ్యమైన నౌకా కేంద్రం. నౌకావ్యాపార మభివృద్ధి గాంచగల అన్ని సౌకర్యములు యున్నవి. ఆర్థికముగా అన్ని జిల్లాలకంటె హెచ్చు సంపదను సృష్టించగలదు. యిటువంటి జిల్లాకు ప్రత్యేక శ్రద్ధవహించుట ప్రభుత్వకర్తవ్యము. యీ జిల్లా సత్వరాభివృద్ధి దేశాభివృద్ధి కెంతగానో తోడ్పడగలదు. నేటివరకు యీ జిల్లా వెనుకబడియుండుటకు గల కారణములు గుర్తించి ప్రభుత్వం శ్రద్ధవహించాలి. ఆంధ్ర రాష్ట్రములో అన్ని జిల్లాలకంటె వెనుకబడియున్నదన్న సంగతి మరువగూడదు. రాష్ట్ర మొత్తముపై జిల్లాలవారిగా వేసే అభివృద్ధి ఈ జిల్లాకు చాలదు. యీ జిల్లా చరిత్రనుబట్టి నైసర్గిక స్థితిననుసరించి దేశాన్ని ఎదుర్కొన్న ఆహారక్లిష్టపరిస్థితులదృష్ట్యా సత్వరాభివృద్ధి చెందగల అవకాశాల నుపయోగించుకొనుటకు యీ జిల్లా అభివృద్ధికి ప్రత్యేక ప్రణాళిక అవసరం. ఆర్థిక వైజ్ఞానికాభివృద్ధిని పెంపొందింపజేసే యితర సౌకర్యాలు కలుగజేయుట ప్రభుత్వకర్తవ్యము.

ఈ జిల్లాలోగల శాసనసభ్యులు ముఖ్యముగా గుర్తించి అన్ని విధముల వెనుకబడియున్న యీ జిల్లాఅభివృద్ధికి ప్రభుత్వమును గుర్తింపజేసి తగినసౌకర్యాల నిమిత్తం కృషి చేయాలి. యింత విశాలమైన జిల్లాకు శాసనసభలోగూడా చాలినంత బలము లేకపోలేదు. అధికార అనధికార సభ్యులంతా కలసి ఐక్యతతో యీ జిల్లాఅభివృద్ధికి కృషిచేయుట వారి కనీస ధర్మం. అత్యవసరం.

# దొంగ, దొర

(11-వ పేజీ తరువాయి)

నికి ప్రయత్నం చెయ్యలేదు. బెల్లం కొట్టిన రాయిలాగా మతిపోయిన మనిషిలాగా కళ్లప్పగించి నిలబడ్డాడు. చేతులకి సంకెళ్లు వెయ్యటానికి పోలీసులు వచ్చినప్పుడుమటుకు నోరు తెరచి ఒక కోరిక కోరాడు. ఆ నెక్లెస్ పెట్టె తనకి ఇమ్మని అడిగాడు. కోర్టువారు ఉదారంగా ఆ పెట్టెని ఇచ్చేశారు. గోవిందం ఆ పెట్టెని తన చొక్కా జేబులో హృదయానికి సమీపంలో భద్రంగా దాచుకున్నాడు.

ఆ పెట్టెలో ఏమి విశేష ముందో, ఆ పెట్టెని తనకి ఇమ్మని గోవిందం ఎందుకు అడిగాడో ఎవరికీ అర్థం కాలేదు. ఆ ఖాళీ పెట్టెని అడగగానే అంతా ఫక్కున నవ్వారు. మానవహృదయంలో నిగూఢ రహస్యాలు తెలిసిన అంతర్యామి మటుకు వెర్రినవ్వు నవ్వక సానుభూతితో ఒక్క బాష్పబిందువు వుంటాడని నాకు గట్టి నమ్మకం!

తరవాత కొన్నాళ్లకి రంగాచారి గుండె ఆగిపోయి హఠాత్తుగా పరలోకానికి ప్రయాణం కట్టాడు. తండ్రిపోయిన క్షణంలోనే పెట్టె తాళంచెవులు కొడుకు చేతిలో పడినయ్.

శ్రాద్ధకర్మలన్నీ సక్రమంగా ముగించిన తరవాత ఒకనాడు మధ్యాహ్నం సావకాశంగా రామాచారి ఇనప్పెట్టె తెరిచాడు. కొన్ని పాతపంచాంగాలూ, పాతచిట్టాపుస్తకాలూ, పాతగుడ్డతో చుట్టిన ఒక కాసులమూటా లోపల కనిపించినయ్. ఆ పాతపుస్తకాలని చికాకుగా అవతలికి గిరాటు వేశాడు. ప్రాణం పోయేదాకా తండ్రి తనకి తాళంచెవి ఎందుకు అప్పగించలేదని లోపల రగులుతోంది. ఒకదాని తరవాత ఒకటిగా లోపలున్న చెత్తనంతనీ రామాచారి బైటికిలాగాడు. అన్నిటికంటే అడుగున ఒక ఎర్రటి పట్టుగుడ్డమూట కనిపించింది. ఆత్రంగా మూట విప్పేసరికీ లోపల ధగధగలాడే నెక్లెస్ కనిపించి కళ్లు జిగేల్ మన్నయ్.

ఆ ఆభరణాన్ని రామాచారి చాలా పరీక్షగా చూశాడు. నెక్లెస్ కొత్తమెరుగు మాయలేదు. మిలమిల మెరుస్తున్నది. తాపడంచేసిన రవ్వలు తళతళలాడుతున్నయ్. దాని కొక్కానికి పట్టుకుని రెండు నల్లటి పొడుగైన వెంట్రుకలు వేళ్లాడుతూ కనిపించినయ్. అటునించి ఇటూ, ఇటునుంచి అటూ తిప్పుతూ ఎంతోసేపు పరీక్షచేశాడు అది ఎవరిదో, అక్కడికి ఎందుకువచ్చిందో, అంత రహస్యంగా తండ్రి దాన్ని ఎందుకు దాచి పెట్టాడో అర్థం కాకుండా వుంది.

ఆలోచించగా ఆలోచించగా కొంతసేపటికి గుర్తొచ్చింది. అప్పుడు పోయింది ఈ నెక్లెసే. దీన్ని ఎత్తుకపోయాడన్న నేరానికే గోవిందం కఠినశిక్ష అనుభవిస్తున్నాడు. కాని పోయిన ఈ నగ, నిజాయితీపరుడనీ, ఘరానా పెద్దమనిషనీ పేరుమోసిన తన తండ్రిగారి ఇప్పెట్టెలో ఎందుకు దొరికింది? ఇదొక చిక్కుప్రశ్నగా పరిణమించింది. ఈనాటిదాకా రామాచారికి ఈ ప్రశ్న కొరకరాని కొయ్యగానే వుండిపోయింది!



ఎలెక్ట్రికల్ మోటారుతో నడుపబడుతున్న సానమీద రైతు
కోతయంత్రంలో కత్తికి పదును పెడుతున్నాడు.



వర్జీనియాలోని వ్యవసాయ కేంద్ర
ఎలెక్ట్రికల్ సామానులను

# అమెరికా వ్యవ
# విద్యుచ్ఛ



కొలంబియా నదిమీది కౌలీ ఆనకట్ట దీనినుంచి 80 వ్యవసాయ
క్షేత్రాలకు విద్యుచ్ఛక్తి సరఫరా అవుతుంది.



ఎలెక్ట్రికల్ సౌకర్యాలన్నీ అమ



...ంలో ఒక రైతు ఇల్లాలికి రకరకాల
...వాడటం మెలాగో నేర్పుతున్నారు.





వ్యవసాయ క్షేత్రాలలోని కుటుంబాలకు నగరవాసులకుం డే
రేడియో, ఎలెక్ట్రికల్ స్టౌ వగయిరా అన్ని సౌకర్యాలూ ఉంటై.

# ...సాయక్షేత్రాలలో
# ...క్తి ప్రభావం





...నవించుతున్న ఒక రైతు కుటుంబం.





విద్యుచ్ఛక్తి సహాయంవల్ల రైతులు రాత్రివేళకూడా పనిపాటలు
చేసుకొనే సావకాశం కలుగుతోంది.

సినిమా:



రాజకమల్ కళామందిర్ వారి 'దహేజ్'లో ప్రతిభావంతంగా నటించిన జయశ్రీ

వ్యంగ్యరచన

# 'అఖిలభారత సినిమాతారల సమావేశం'

[శ్రీ ఎన్. వసంతకుమార్]

★

ఆగస్టు 16 స్వాతంత్రదినోత్సవం తర్వాత భారతదేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగినది ఈ చారిత్రాత్మకమైన సమావేశం. ప్రఖ్యాతివహించిన భారత దేశపు నటీమణులు అందరూ సుందరీబాయిహాలులో 1950 ఫిబ్రవరి 26 వ తేదీ సమావేశమైనారు ఆ సమావేశానికి అధ్యక్షత వహించటానికి శ్రీయుత చమన్‌లాల్ గారు దయతో అంగీకరించారు. రాత్రి 7 గం॥ సభను ప్రారంభిస్తూ శ్రీ చమన్‌లాల్ గారుచాలా సేపు మాట్లాడారు వారు అసలు ఈ ఫిలింపరిశ్రమ కనిపెట్టింది భారతీయులు ఒక్కరే నని గట్టిగా వక్కాణించారు. అందుకు మహాభారతం నిదర్శన మన్నారు.

సంజయుడు ధృతరాష్ట్రుడికి భారత యుద్ధపు ఫిల్ము చూపించాడట. అంతే కాక అది పంచరంగుల ఫిల్ము అనికూడా చెప్పారు. కాని దేశంలో మహాభారతయుద్ధంవలన చెలరేగిన సంక్షోభంలో మనపూర్వీకుల కళలన్నీ అణగారిపోయినై దేశంలో 'కళ' పోయింది ఒక్క ఫిల్మేకాదు ఆటంబాంబులుగూడా మనవాళ్లే కనిపెట్టారు. అంతేకాదు హైడ్రోజన్ బాంబుకూడా మన దే. పాశ్చాత్యులు మన ప్రాచీనగ్రంధాలు చదివి ఇది గ్రహించగలిగారు ఈ మారణాయుధాలన్నీ మన పూర్వీకుల కాలంలో ఉండేవి కాని వాటిని అప్పుడు యోగబాంబులు అనేవారు. శివుడు ఒక్కసారి ప్రపంచం భస్మం చేయటం ఈ యోగబాంబులవల్లనే కాని ఈనాడు మనలో ఉన్న పరస్పరవైషమ్యాలే మన ఈ పరిస్థితులకి కారణమయినై అయినప్పటికి ఈనాటి మనమంత్రులలో, నాయకులలో ఎవరైనాసరే మానససరోవరసరస్సుకి పోయి 30 ఏళ్లు తపస్సుచేస్తే మనం తిరిగి మనపూర్వీకుల్ని ఆయుధాల్ని సంపాదించగలుగుతాం నేను ప్రశ్నిస్తున్నాను నిజంగా ఎవరైనా అటువంటి త్యాగం చెయ్యగలవారువున్నారా అని. (సభలో 'లేరు లేరు' అని కేకలు) నాకు తెలుసు ఎవరూ తెగించలేరని ప్రపంచంలోని అన్ని దేశాలనాయకులకంటే మన భారతదేశనాయకులకు మన సినిమాతారలంటే మిక్కిలి ప్రేమ, అనురాగం అని అందరికీ తెలుసు (హియర్, హియర్ అని కేకలు చప్పట్లు) నిజంగా ఈనాడు మన భారతదేశభవిష్యత్తు అంతా మీవంటి సినిమాతారల మీదనే ఆధారపడివు[illegible] కాబట్టి మీరంతా దీక్షతో దేశంకోసం పనిచెయ్యాలి చైనా, ఇండోచైనా, బర్మా, మలయా, కొరియా దేశాలలో ఎలా విప్లవజ్వాలలు చెలరేగి అశాంతి ప్రబలిపోతోందో చూడండి. ఇటువంటి పరిస్థితులలో మీరు చెయదగినపని ఎంతైనావుంది. కాని ఫిలింపరిశ్రమయందు మన ప్రభుత్వం తగిన శ్రద్ధ తీసుకోటం లేదు మీరుఅందరూ రేపటినుంచే ఖద్దరుబట్టలు కట్టి, వారానికో పూట ఉపవాస ముంటూ, దీక్షగా వుండండి. ఈ సర్వోదయప్రిన్సిపల్స్ వలననే మన ఫిలింపరిశ్రమ అభివృద్ధిలోకి రావాలి. ఆ రోజునే మీరు ఇతరఖండాలతో ఫిలింఫీల్డులో పోటీచేసి గెలుపొందుతారు. (సభలో చప్పట్లు) శ్రీ చమన్‌లాల్ గారి ఉపన్యాసం అయిన తర్వాత వెండితెర అందాలరాణి శ్రీమతి జాస్మిన్ కొలదిసేపు ఫిలింపరిశ్రమ

గురించి మాట్లాడింది. అంతటితో ఆ రోజు సమావేశం ముగిసింది.

మర్నాడు రాత్రి 7 గం॥ సబ్జక్ట్సు కమిటి సమావేశమైంది దీనికి ప్రేక్షకులను ఎవర్నీ రానివ్వరు. పత్రికావిలేఖరులు, పోలీసువారు మాత్రం రావచ్చు ఆ సమావేశానికి వచ్చిన వారిలో ముఖ్యులు మిస్ కర్గిస్, మిస్ కురయు, మిస్ ఫిగార్, మిస్ ఫెతాబాలి, మిస్ మస్తానా. మొదటి ప్రతిపాదన సభలో అందరూ ఏకగ్రీవంగా ఆమోదించారు.

సంవత్సరానికి 35 కాంట్రాక్టులు వచ్చే తారలు స్టాండర్డు హీరోయిన్స్ సంవత్సరానికి 16 వచ్చేవారు 'A' క్లాసు హీరోయిన్స్ 8 కాంట్రాక్టులు వచ్చేవారు 'B' క్లాసు హీరోయిన్స్‌గా పరిగణించబడతారు. సంవత్సరానికి 8 కన్నా తక్కువ కాంట్రాక్టులు వచ్చేవారు సైడ్ హీరోయిన్సుగా యెంచబడతారు. అటువంటివారు మెడికల్ సర్టిఫికేట్ లేనిదే షూటింగ్‌కి రాకుండా ఉండకూడదు. స్టాండర్డ్ హీరోయిన్స్ 'A' క్లాసు వారు వారి యిష్టం వచ్చినప్పుడు ఎవరికీ తెలియపర్చకుండానే షూటింగ్‌కి రాకపోవచ్చు ఈ ప్రతిపాదనని మిస్ ఫిగార్ సెకండ్ చేసింది. అందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. తర్వాత స్టూడియోలలోని అసభ్యకృత్యాలనిగురించి చాలా సేపు తీవ్రంగా చర్చించారు.

నాకు ఫిల్ముల్లో నటించాలని ఉంది కాని మన సెట్లో బొర్రమీసాలు, బట్టతల చూస్తుంటే నాకు భయం వేస్తోంది. ఎందుకో ఎప్పుడూ నావంక అదోమాదిరిగా చూస్తుంటాడు అంది మిస్ చంపకాలి

'ఆసి నేరియో రచయిత చంద్ నిన్న స్టూడియోలో కలిసినప్పుడు నేను అతన్ని ప్రేమించకపోతే నాకు ఉన్న మంచి డైలాగ్స్ అన్ని కట్ చేస్తానన్నాడు. నే నేం చేసేది ?" అంది మిస్ చటర్జీ

ఆ కెమెరామెన్ ఎప్పుడూ నా దుంప తెంపుతుంటాడు. నేను అతనితో 'కో ఆపరేట్' చేస్తే నాకు మంచి ఆంగిల్స్ సెలక్టు చేస్తాడట. మరి నేను అతనికి ఏవిధమైన 'కో ఆపరేషన్' (సహకారం) ఇవ్వాలో అర్థం కావడం లేదు అంది మిస్ చీతాజిజామ్.

పైకి రావటమే ప్రధానసు. కాబట్టి ఇటువంటి చిన్న విషయాలలో అంత పట్టింపు అక్కర్లేదు అన్నారు. తర్వాత చాలా విషయాలు ముచ్చటించారు. కాని అందులో కొన్ని ముఖ్యమయినవి ఉన్నయ్. గవర్నమెంటుని డాలర్ సౌకర్యాలు కలిగించమని లేకపోతే తమ కుక్కలకు అమెరికానుంచి ఆహారపదార్థాలు తెప్పించుకోటానికి వీలుండదని కోరారు.

మన ఫిల్ములు ఎంత పొడవు ఉండాలంటారు అని అడిగింది మిస్ కర్గిస్.

డ్రము సినిమా తిరుచ్చిలో రెండో సంవత్సరం నడుస్తోంది. కాని ఇంతవరకూ ఇంకా మొదటి ఆట కాలేదు. అంది మిస్ ఫిగార్.

కోయంబత్తూరులో నేను హీరోయిన్‌గా ఒక ఫిల్ము షూటింగు ప్రారంభించారు. ఇప్పుడు ఆ సినిమాలో నా కూతురు హీరోయిన్. కాని ఇంతవరకూ చిత్రం పూర్తి కాలేదు. అంది మిస్ జబ్బాకుసుం.

(1) 40 వేల అడుగులకంటె ఎక్కువ పొడవుగా ఫిల్ములు తీయరాదనీ,

(2) ఒక చిత్రంలో 50 పాటలకంటె ఎక్కువ ఉండరాదని,

(3) 6 సం॥ కన్నా ఎక్కువ కాలం చిత్రనిర్మాణం సాగరాదని,

(4) 10 కోట్లకన్నా పబ్లిసిటీ ఖర్చు మించరాదని,

ప్రొద్యూసర్లను కోరుతూ ఒక తీర్మానం ప్రతిపాదించారు.

ఆఖరి ప్రతిపాదన చాలా ముఖ్యమయినది.

నటీమణులలో కొంతమంది బయలుదేరి ప్రభుత్వంతో రాయబారం సాగించాలని తీర్మానించారు. ఆ రాయబారంలోని విషయాలు.

(1) అమెరికన్ ఫిల్ములను బాన్ చెయ్యాలి. లేదా,

(2) భారతదేశపుతారలు కూడా తెరపై ముద్దుపెట్టుకోవచ్చు తమకాళ్లనీ, నగ్నంగా చూపించటానికి ప్రభుత్వం అంగీకరించాలి. ఇంతటితో అఖిలభారత సినిమాతారల సమావేశం సమాప్తమయింది.

(ఇందులోని పాత్రలన్నీ కల్పితములు. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు. ఈ వ్యాసానికి "కృష్ణచంద్ర" వ్యాసం ఆధారం.)



ఎ వి ఎం. వారి 'జీవితం'లో వైజయంతీమాల, టి. ఆర్. రామచంద్రన్



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి 'సౌదామిని'లో టి. ఆర్. రజని.

# గ్రంథసమీక్ష

భారతి—శరత్ చంద్ర చటోపాధ్యాయ. అనువాదం శ్రీ బొందలపాటి శివరామకృష్ణ. ప్రచురణ— దేశికవితామండలి, గవర్నరుపేట, విజయవాడ వెల రు 4-0-0.

శరత్ చంద్రుని ప్రఖ్యాత బెంగాలీనవల "పథేర్ దాబీ" కి ఇది తెలుగు అనువాదం. కాంగ్రెస్ వారు 1936లో పరిపాలనాధికారం స్వీకరించినతరువాత ఈ బెంగాలీనవలపై నిషేధం తొలగించబడింది.

బ్రిటిష్‌పాలకులు నిషేధం విధించడానికి తగిన కారణం లేకపోలేదు. ఈ నవలలో విప్లవనీతి, రాజకీయహత్యలు, అహింసాత్మకోద్యమాలనుగురించి దీర్ఘచర్చ జరిగింది.

సన్నివేశాలూ, పాత్రరచన, కథానిర్మాణం చారిత్రకవాస్తవికతను చెప్పక చెప్పుతున్నాయి. భారతదేశస్వాతంత్ర్య సమరకాలంలో రాజకీయహత్యాకాండపట్ల క్రమంగా విముఖత, అహింసాతత్వంపట్ల ఆదరణ కలుగుతున్న రోజుల్లో భారతీయుల హృదయాలలో చెలరేగిన సంశయతుమురాన్ని ప్రతిఫలింపచేస్తున్న దీ గ్రంథం. ఈనాడుకూడా సంఘవ్యవస్థలో సమూలమార్పు తేవడానికి విధ్వంసకరమైన సాయుధవిప్లవమే శరణ్యమా లేక శాంతియుత పరివర్తన సాధ్యమా అనే సంశయాన్ని పూర్వాపరాలు ఆలోచించి, అనుభవంలో ఏరీతిగా ఉంటుందో నిరూపించి, హృదయం ఏమి చెప్తుందో తెలుపుతోం దీ నవల. రాజకీయాల్లో ప్రవేశించడానికి తగిన మనోబలంలేని సామాన్య మధ్యతరగతి సంసారిగా మతాచారాలయం దనురక్తుడుగా అపూర్వబాబు పాత్రను చిత్రించి, ఈ రాజకీయరంగంలో ఒక సామాన్యప్రేక్షకుని సృష్టించాడు. శాంతజీవనమే కోరుతూ, పరంపరగా వస్తున్న మతాచారాల్ని విడిచిపెట్టనవసరం లేదని భావిస్తూ కేవలం సామాన్యప్రేక్షకునివలె రాజకీయరంగాన్ని వీక్షిస్తూ రాజకీయాలతో అట్టే నిమిత్తం లేకుండా ఉంటాడు అపూర్వబాబు. రాజకీయ సంచలనంలో పడి విప్లవసిద్ధాంతాన్ని ఎంతో లాక్యంగా అనుభవపూర్వకంగా నిరూపించ యత్నించగా హింసాపూర్వక కార్యక్రమాల నంగీకరించని సంశయాత్మ భారతి, విప్లవం, హత్యలతో నిమిత్తం లేకుండా శాంతిఅహింసలతో స్వాతంత్ర్యాన్ని సాధించడానికి మార్గం లేకపోలేదనే అస్పష్టమైన స్థిరమైన విశ్వాసం ఆమె కుంటుంది. విప్లవమే ప్రధానంగా ప్రమాదాల్ని లెక్కపెట్టకుండా అశాంతితో మనోవ్యథతో ఆసియాఅంతటా సంచరించే వ్యక్తి సవ్యసాచి.

నవలంతా ఈ ముగ్గురే ముఖ్యపాత్రలు ఆనాటి భారతీయహృదయానికి ప్రతినిధులు.

పాశ్చాత్యనాగరికతాసంపర్కం కలిగి, భారతదేశదుస్థితికి పరదేశపాలకులు వ్యక్తిగతంగా దోషులు కారనీ, ఆ నాగరికతను చవి చూపి భారతదేశానికి మేలే చేశారనీ, భారతీయుల దుస్థితిని నివారించాలంటే శాంతియుతపరివర్తనా కార్యక్రమ మొక్కటే శరణ్యమనీ కథానాయిక భారతి విశ్వాసం. కాని ఆమెకు రాజకీయసాంఘిక సేవలలో గురుతుల్యుడైన సవ్యసాచి విప్లవం తప్ప మరోమార్గం లేదంటారు. చీనా, మలాకా, ఇండోనీషియా, బర్మాలలో విప్లవసంఘాల్ని స్థాపిస్తూ రాజకీయహత్యల్ని ప్రోత్సహిస్తూ తిరుగుతాడు సవ్యసాచి.

పాశ్చాత్యుల దాస్యంనుంచి ఆసియా దేశాల్ని విముక్తి పరచడానికి సన్‌యెట్ సెన్‌తో చేరి కృషి చేసినట్లు సవ్యసాచి ఒకచోట చెప్తాడు. "విప్లవం హింసద్వారానే సాగుతుంది" అంటారు. ఈ విప్లవం రానిదే స్వాతంత్ర్యసిద్ధి అసంభవం అంటాడు. అవసరమైనప్పుడు దేశీయుల్ని విప్లవంలో బలియివ్వవలసివచ్చినా వెనుదియ్యకూడదంటాడు.

కార్మికుల సమ్మెలు విప్లవానికి రాజమార్గాలనీ, విప్లవంకోరకే విప్లవం లేనట్లుగానే కార్మికుల సమ్మెలు కార్మికుల జీతాల హెచ్చింపులకోసమే కాదనీ ధరమలక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని విప్లవాన్ని సాధించాలనీ సవ్యసాచి వాదిస్తాడు. ఆ లక్ష్యాన్ని మరిచిపోతే ఈ సమ్మెలవల్ల తప్పకుండా కార్మికుల స్థితి, దేశమూకూడా సర్వనాశన మౌతాయంటాడు. విప్లవకార్యక్రమలక్ష్యాలన్నీ లోతుగా అవగాహనచేసుకుని సూక్ష్మంగానూ స్థూలంగానూ చర్చించి, సన్నిహిత కథనాకౌశలంతో ఉభయపక్షవాదాల్నీ నిష్పక్షపాతంగా చిత్రించి శరత్ బాబు లెనినిస్టుసిద్ధాంతాల్నీ అహింసాసిద్ధాంతాల్నీ కథాబద్ధం చేశాడు. వీరి అన్యగ్రంథాలకంటె ఈ గ్రంథంలో రచనాకౌశల్యం, పాత్రచిత్రణా, కల్పన పరిపక్వదశలోకి వచ్చాయి.

మన రాజ్యాంగము : సంకలనం : డి. వి. సుబ్బ శాస్త్రి, ప్రచురణ : నవయుగ ఆర్థిక వైజ్ఞానిక కేంద్రం, మదరాసు 17. వెల రు. 1-0-0.

సార్వజనీనవయోజకవర్గవిధానం ఎన్నికలు జరపాలని మన కొత్తరాజ్యాంగం విధించింది. అందువల్ల ప్రభుత్వనిర్మాణంలోనూ, ప్రభుత్వపాలనానిర్వహణలోనూ. ప్రజాస్వామ్యసూత్రాలు ఏరీతిగా పాటించబడుతున్నదీ సరిగా గమనించి ఎన్నికలలో ఏపక్షానికి పాలనాధికారం ఒప్పగించాలో నిర్ణయించుకోగలగాలంటే ఆ ప్రజాస్వామ్యసూత్రా లేమిటో, మన రాజ్యాంగంలో ఉండే విశేషాలేమిటో తెలుసుకోవలసిన కర్తవ్యం ప్రతిపౌరునికే ఉంది. మన కొత్త రాజ్యాంగనిర్మాణంలోని ముఖ్యాంశాలేమిటో ప్రజలకు ఎట్టి హక్కులనిస్తున్నదో ఈగ్రంథంలో స్థూలంగా వివరించబడినాయి దీనికి కళా వెంకట్రావుగారు తొలిపలుకు వ్రాశారు.

---








# రాణీ హాడా

[రవి]

మేవాడ్ సరదారగు చందావతు ఇరువదిసంవత్సరముల నవయువకుడు. మహావీరుడు. అతనిభార్య రాణీ హాడా సుగుణవతి, సౌందర్యవతి. భార్యాభర్త లిరువురూ అన్యోన్యంగా ఉంటూన్నారు. ఒకనాటి సాయంకాలం భార్యాభర్త లిరువురూ వెన్నెలలో షికారు చేస్తూన్నప్పుడు :

"చూడు హాడా? కొంతమంది తండ్రులు చాలా దుర్మార్గులు. వారిని తండ్రులనడానికూడా తగరు' అన్నాడు చందావతు.

"కారణం ?"

"చూడరాదూ! రూపనగర రాజకుమారి రాణాను ప్రేమించి, అతనికి ఉత్తరముగూడా వ్రాసింది. కాని తండ్రి ఆమెను బలవంతముగా మహామ్మదీయప్రభువగు ఔరంగజేబు కిచ్చి ముడికట్టా లనుకొంటున్నాడు. ఆ అమ్మాయి రాణా సహాయం కోరింది."

"మరి రాణాగారు సహాయము చేయడానికి ఒప్పుకొన్నారా? ఢిల్లీ సామ్రాట్టుతో—"

"రాణాగారు శరణన్నవారిని తప్పక రక్షిస్తారు. అందులోనూ ప్రేమించిన పెళ్లి. ఢిల్లీసామ్రాట్టుతో పోరాడడానికి నిశ్చయించి, అప్పుడే కొంతసైన్యాన్ని కూడా రూపనగరానికి పంపించారు."

"ప్రాణాలర్పించైనా ఆ పిల్లను రక్షించాలి."

"ఆమాటలు వదలిపెట్టు. ఈ రోజు వెన్నెల్లో జలవిహారమొకటి ఏర్పాటుచేయించాను. నావలో ఎక్కి సరస్సులో వెన్నెల తరగలలో విహరిద్దాము."

హాడా జవాబుచెప్పబోయేలోగా ఒకదాసీ అక్కడకు వచ్చి"సర్దార్ జీ, వెంటనే దర్బారు జరుగుతుందట. ఆ దర్బారులో ఔరంగజేబుతో యుద్ధానికి సైన్యాధిపతిని ఎన్నుకొంటారట. రాణాసాహేబ్ తమరిని వెంటనే దర్బారుకు కొనిరమ్మన్నారు, అని విన్నవించింది.

చందావతు దుస్తులు ధరించి దర్బారుకు వెళ్లాడు. రాణాగారికి నమస్కరించి తన ఆసనములో కూర్చున్నాడు.

"ఔరంజేబుతో యుద్ధముచేయడానికై సైన్యాధిపతి కావాలి,
మీలో ఎవరికి కోరిక యున్న
నేతులెత్తండి" అన్నారు ర
గారు.

అంతా నిశ్శబ్దముగా ఉన్నా
రాణా లేచి గంభీరము
"ఇప్పుడు మనకొక సైన్యా
కావాలి. మీలో ఎవరో ముం
రండి" అని ఆజ్ఞాపించాడు.

ఎవరూ రాలేదు.

రాణాకు కోపమువచ్చి కం
జేసినాడు. "పిరికిపందలు ఔ
జేబుతో యుద్ధమనేసరికి జం
తున్నారు." అన్నాడు.

చందావతు యువకర
పేడక్కింది. "నేను వెడతా
లేచి రాజు ఎదుట ప్రమా
చేసినాడు.

ఈ సమాచారం హాడాకు తె
చాలా సంతోషించింది. ఆ
కెన్నెన్నో ఆలోచనలు పోసాగి
"నా భర్త మొగలుపాదుష
ఓడించి విజయలక్ష్మిని చేపట్టి
రంలో ప్రవేశింపగానే ఎం
సత్కారం జరుగుతుంది. న
అందరూ వీరపత్ని అని పిలుస్తార
ఇంతలో చందావతు యింటికి వ
నాడు. హాడా ఆనందాతిరేకం
భర్తనాహ్వానించింది. స్వహస్తాల
అతని నడుము పట్టునకత్తిని వ్రేల
దీసింది. చందావతు యుద్ధా
బయలుదేరినాడే కాని, వ
స్సంతా సౌందర్యవతి అయిన భా
మీదనే ఉన్నది. భార్యవద్ద సెల
పుచ్చుకొని కొంతదూరము పో
మరల తిరిగివచ్చినాడు.

"తిరిగి యిలా వచ్చారేం?"

"చూడు హాడా ! శత్రువు
చాలా బలవంతులు. అందుచేతనే
యుద్ధమునుండి తిరిగిరాలేకపో
వ్చును. ఒకవేళ నేను యుద్ధముల

చనిపోయినట్లైతే నా వంశగౌరవము, నా పరువు, మర్యాదా......"

హాడాకు భర్తమాటలమీద సందేహం కలిగింది.

"స్వామీ! తమరు న్యాయము కొరకు, ధర్మముకొరకై పోరాడబోతున్నారు. ఈసమయములో స్త్రీలమగు మేము ఏకోచితధర్మానికి భంగము రానీయము, మాపాతివ్రత్యానికి భంగముకలుగదు మీరు నిర్భయముగా ధర్మముకొరకై పోరాడి విజయలక్ష్మిని చేపట్టండి."

చందావతు యుద్ధానికి పోయినాడు. పోతూ తనభార్యకు పాతివ్రత్యధర్మాలను బోధించడానికి ఒక వృద్ధపురోహితుని నియోగించాడు పురోహితుడు వచ్చి హాడాకు ధర్మపన్నాలు చెప్పడం మొదలెట్టినాడు.

హాడా ఆలోచించింది. నా భర్త నా సౌందర్యానికి లోనైనాడు. అందుచే ఆయనకు హృదయదౌర్బల్య మేర్పడింది. ఈస్థితిలో వారు ఉత్సాహోద్రేకాలతో యుద్ధం చేయలేరు. ధర్మాన్ని, దేశాన్ని, రూపనగరరాకుమారిని రక్షింతురు. దీనికంతకూ కారణం నా సౌందర్యం. ఈ పాపం నన్ను చుట్టుకుంటుంది. ఈ పరిస్థితిలో ఏమి చేయవలెనా" అని ఆమె పరిపరివిధాల ఆలోచింపసాగింది. ఇంతలో మెరపులా ఆమెకొక ఆలోచన తట్టింది. ఆమెముఖము వికసించింది, ధర్మంకొరకు. న్యాయంకొరకు తన ప్రాణాలను బలిపెట్టడానికి నిశ్చయించుకొన్నది. వెంటనే కత్తి తీసికొని, దాసీని పిలిచింది. "చూడు. ఇదుగో యీ నా శిరస్సు, యీ ఉత్తరం తీసికొని వెళ్లి పురోహితులవారికియ్యి, వారు వీటిని నా స్వామి కందజేస్తారు". అంటూ ఆమె కత్తిలో తనశిరస్సును ఒకవ్రేటుతో ఖండించుకొన్నది.

పురోహితుడు లేఖను శిరస్సును చందావతుకు అందజేసినాడు. ఆ లేఖయం దిట్లున్నది.

స్వామీ! తమరు నా సౌందర్యానికి లోనై యుద్ధానికి పోవడానికి వెనుకముందాడినారు. ఉత్సాహోద్రేకాలు లేని సేనాపతి సైన్యాన్ని సరిగా నడిపించలేడు. ఏ సౌందర్యానికి మీరు దాసులైనారో, ఆ సౌందర్యదేవతశిరస్సు యిది. ఇక మీరు అన్యాలోచన లేకుండా దేశాన్ని ధర్మాన్ని రక్షించండి."

ఉత్తరము చదివి చందావతు దుఃఖించాడు. కొంతసేపటికి అతనిలో రోషముప్పొంగింది. భయంకరంగా పోట్లాడి చివరకు వీరస్వర్గమలంకరించాడు.



వరంగల్ కార్మికమహాసభ సందర్భంలో హైదరాబాద్ మంత్రులు రామకృష్ణారావు, బసవరాజు గార్లకు కార్మికనాయకులస్వాగతం.

బాలానందం.

# కవితావస్తువు

శ్రీమతి పడలి వెంకటరామలక్ష్మి

సాయంకాల మయింది. కవిగారు తోటలో పచారుకు బయలు దేరారు. కవితావస్తువుకోసం ఆలోచిస్తున్నారు. కవిగారికి హుషారు కోసం వేడివేడి టీ యిద్దామనే కుతూహలంతో, టీ అమ్మేవాడు ఒక కప్పు టీ తీసుకొచ్చాడు.

కవిగారు ఆలోచనలోంచి తేరుకుని టీవాడిని తేరిపార చూశారు. నల్లని మసిపాతలు కట్టుకొని, అసహ్యమేస్తున్న అతడు, అతని మురికి చేతులు, అంతకన్న మురికిగా ఉన్న టిన్ను రేకు పొక్కులో తొరకలు ముక్కతో నిండిఉన్న టీ, చూడగానే, కవిగారికి యెక్కడలేని అసహ్యం వేసి, వాంతి అయేపర్యంతం అయింది.

"ఛీ! ఛో మురికివెధవ! నువ్వూ నీటీ కలిసి మురుగు కాలువలో దూకండి" అంటూ నాలుగు తిట్టి మనసులో ఇల్లా అనుకున్నాడు-

"యేమిటో! యీ దేవుడు యిలాటివాళ్ళని సృష్టించడంలో అర్థంలేదు"

చెమటోడ్చి పొట్టపోసుకోలేని ఆ నిరుపేదఆకారం- మురికిచేతులు- మురికిటీపాత్ర - తొరకల టీ మాత్రమే కవి చూడగలిగాడు గాని వాడు మంచివాడనే విషయం అతని మనస్సుకు తట్టలేదు చూపుకు అందలేదు!

కవిగారు అక్కడనుంచి యింకో అడుగు ముందుకు వేశారు

కవిగారిని వెక్కిరిస్తూ అక్కడే దగ్గరలో ఓ చెట్టు కనిపించింది.

కవిగారు చీదరించుకొని-

"రామ! రామ! పొద్దున్న లేచి యెవరిమొహం చూశానో-అనాకారివెధవ విరగడయ్యా డనుకుంటే యీ వంకరటింకర దెయ్యపు చెట్టు యెదురయింది నేలకి వొంగిపోతూ యేమిటీ వంకరటింకం చెట్టు, ఎమిటీ బోదె! యెంత లావుగా ఉంది' కుష్ఠురోగినాగే-

ఇంకా తిట్లు, దీవనలు పూర్తికా లేదు. ఇంతలో దబాదబాముని పెద్ద వర్షం కురియడం ప్రారంభించింది కవిగారు తడిసిపోకుండా పరుగున వెళ్లి ఆ వంకరటింకర చెట్టుకిందనే దాని వద్దకే వెళ్ళారు.

కవిని ఆ చెట్టు తననీడకు రమ్మని పిలుస్తోందా అన్నట్లు ఉంది.

ఆ చెట్టుకింద కవిగారుశరీరం మీద ఒక్కచినుకేనా పడకుండా సురక్షితంగా ఉన్నారు.

టీ అమ్ముకునేవాడుకూడ తన సామానుతోసహా పరుగెత్తి అక్కడకే వచ్చాడు. చలికి వొణుకుతున్న కవిగారిని చూసి జాలివేసి తిరుగా తన వేడివేడిటీ అందిచ్చాడు.

చలితో వణుకుతున్న కవిగారు వెనకాముందూ ఆలోచించకుండా ఆ తొరకలతోకూడిన టీనే అమృతతుల్యంగా చప్పరించి తాగాడు.

ఇదివరకు తనకి అసహ్యంగా కనపడిన వస్తువులు, తనకు ఎంత ఆధారమయ్యాయో అమృతతుల్యమైన ఆ టీ తాగుతుంటే, కవిగారికి అర్థమయింది. భగవంతునిసృష్టిలోని ప్రతిఅణువూ కవిగారిదృష్టికి కవితావస్తువే!



14-వ తేదీనాడు ప్రభుత్వమందిరంలో ... పార్టీ ఇచ్చిన రాజాజీతో అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్.

# చిన్ననాటి చిలిపి జవహర్లాల్

శ్రీమతి పెనుమాక అన్నపూర్ణ



మన ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ అయిదేండ్ల ప్రాయమున అనేక చిలిపిపనులు చేసేవాడు. ఒకరోజున తండ్రి మోతీలాల్ నెహ్రూ వద్ద రెండు కలాలు ఉండటం చూచాడు. టేబిలుమీద ఆ రెండు



కలాలు పెట్టిఉన్నాయి. ఒకటి తన కుంటే బాగుంటుం దనుకొన్నాడు. "అయినా మా నాన్నగారు వ్రాయటానికి రెండుకలా లెందుకు" అని ఆలోచించాడు. ఆలోచించి ఒక కలం తీసి దాచాడు. మోతీలాల్ రెండోకలంకోసం యిల్లంతా వెతికించాడు. జవహర్లాల్‌నుకూడ అడిగారు. చెప్పలా. కొంతసేపటికి దొరికింది. జవహర్లాలుమీద కోపమొచ్చి తండ్రి దండించబోయేసరికి తప్పించుకొని తల్లిదగ్గరకు పారిపోయి ఆమెవద్ద దాగుకొన్నాడు.

కాని జవహర్లాల్ తల్లిదండ్రులను అమితంగా ప్రేమిస్తూ వుండేవాడు. తనకుచదువుచెప్పే మున్షీజీని, తాను స్వారిచేసే పొట్టిగుఱ్ఱం-రతూని ఎంతో ప్రేమించేవాడు. మున్షీజీ తనకు చెప్పే కథలన్నీ సాయంత్రం స్వారిచేసేటప్పుడు రతూతో చెప్పేవాడు. ఒకరోజున మున్షీజీ చెప్పిన గారడీగుఱ్ఱంకథ చెప్పుతూ "రతూ; నువ్వుకూడా ఆగుఱ్ఱంలా వాయువేగమనోవేగాలతో పరుగెత్తరాదూ" అన్నాడు. ఆమాటలు వినేటప్పటికల్లా రతూకు కోపంవచ్చింది. తనశక్తిసామర్థ్యాలు చూపించాలని వెంటనే దౌడుతీసిందిగాలితో సమానంగా. ఎంతో ఉత్సాహంతో రతూ పరుగెత్తుతుంటే ఎప్పుడు జారాడో జారిపడిపోయాడు జవహర్లాల. కాని గట్టిప్రమాదం సంభవించలా. రతూ తనదారిని యింటికి పోయింది. తల్లిదండ్రులు నివ్వెరపోయి వెతికించి తీసికొచ్చారు జవహర్లాల్ని. కాని జవహర్లాల్ రతూని ప్రేమతోనే చూచేవాడు.

ఇక పండుగలొచ్చాయంటే అతని సంతోషానికి మేరలేదు. ముఖ్యంగా హోళీ, దీపావళీ, పెళ్లిళ్లు పుట్టినరోజుపండుగదినాల్లో మైమరచితోటిబాలురతో గడిపేవాడు. హోళీపండుగరోజున పిచికారీలో వసంతంపోసి, పెద్దవాళ్లమీద కసిదీర కొట్టేవాడు. వాళ్లు తప్పించుకొని తోటలోనికి పరుగెత్తితే, సింహపుపిల్లలా పచకారీతో వెంబడించి వాళ్ల గుడ్డలన్నీ రంగునీళ్ళమయం చేసేవాడు. దీపావళిరోజున వేలకొలదిదీపాలు వెలిగించి సాటిపిల్లలతో ఎగిరేవాడు. ఏ వూరన్నా ప్రయాణం అని తెలిస్తేచాలు ముందుగానే పరుగెత్తి కార్లో డ్రైవరు ప్రక్కనే కూర్చునేవాడు.

అన్నిటికంటె ముఖ్యంగా తన పుట్టినరోజు ఎప్పుడొస్తుందా అని ఎదురుచూచేవాడు. ఎందుకంటే ఆరోజున అందరు తనకు బ్రహ్మరథం పడతారని. ఆ రోజు నెహ్రూ కుటుంబీకులకు పర్వదినం. ఉదయాన్నే లేవంటకముందే తల్లి జవహర్ని సిద్ధత్రాసులో కూర్చోబెట్టి

గోధుమలు, తినుబండారాలు తూచి వాటిని బీదలకు పంచేది. తూస్తున్నప్పుడు నెమ్మదిగా పైకి తాను లేస్తుంటే జవహర్లాల్ సంతోషంతో కిలకిల నవ్వేవాడు. తలంటిస్నానమయ్యాక క్రొత్తబట్టలు తొడుక్కొని స్నేహితులకోసం ఎదురు చూస్తుండేవాడు. చాలామంది తన స్నేహితులూ, నాన్నగారి స్నేహితులూ వచ్చి "దీర్ఘాయురస్తు" అని దీవిస్తూ ఏదో వారికితోచింది చేతికందిస్తే, వాళ్లతో మాట్లాడుతూనే, నెమ్మదిగా పొట్లంలో ఏముందా అని వ్రేళ్ళతో నొక్కుతూ, మెదడుతో ఆలోచిస్తూ గ్రహించటానికి తంటాలుపడేవాడు. కానిఅనుకొన్నదిమాత్రం కాకుండా తనకు ఆశ్చర్యకలిగించేది. తయారయ్యేది, కాగితం విప్పగానే ఇక ఆనాటిసాయంత్రం ఇసుకవేస్తే రాలకుండా ఉండేది ఆనందభవనంలో. ఎందరో స్నేహితులు వచ్చేవాళ్లు ఆ టీపార్టీకి. అమితానందంతో గడిపేవాడు వాళ్ళమధ్య. కాని ఆరాత్రి నిద్రపోబోయేముందు దిండుమీద తల వాల్చగానే ఒకవేడి నిట్టూర్పు విడిచేవాడు. "ఆనాటి కానాడు, ఏనాడూ సరిరాదుగా. పుట్టిన రోజులు రోజూ రావుగా బ్రతికి బాగుంటే మళ్లీ సంవత్సరానికి" అని విచారపడేవాడు.

జవహర్లాల్ పదునైదేండ్లప్పుడు తల్లిదండ్రులతో ఇంగ్లండ్ వెళ్ళాడు. ఇంగ్లండ్‌లో ఓ బళ్ళో చదివాక, కేంబ్రిడ్జిలో న్యాయశాస్త్రం అభ్యసించటానికి వెళ్లాడు. ఒకసారి సెలవు రోజుల్లో తానూ, ఒక ఇంగ్లీషుస్నేహితుడూ కలిసి నార్వేదేశం చూడబోయ్యారు. అక్కడ చాలాసేపు ఎంతోదూరం కొండలమీద తిరిగి తిరిగి అలసిపోయి, శరీరంఅంతా దుమ్ముకొట్టుకొని, చివరకు ఒక హోటలు చేరారు యిద్దరూ. స్నానానికి నీళ్లు కావాలని అడిగారు. ఆ హోటల్ యజమాని "అటువంటి సదుపాయాలు యిక్కడ లేవు. అంతగా స్నానం చెయ్యాలంటే, అదుగో ఆ సెలయేట్లో చేసిరం"డని చూపాడు. ఇద్దరూ అక్కడికి వెళ్ళారు. సెలయేరు జలజలప్రవహిస్తూ సంగీతం పాడుతోంది. జవహర్లాల్ ముందుగా నీళ్లలో అడుగుపెట్టాడు. ప్రమాదవశాత్తు కాలు జారి నీళ్లలోపడి కొట్టుకుపోతున్నాడు ప్రవాహవేగానికి. ఆ యింగ్లీషుస్నేహితుడు వెంబడి, కాలుపట్టి బయటకు లాక్కువచ్చాడు జవహర్లాల్ని. అక్కడికి చాలదగ్గరలోనే ఒక పెద్దజలపాతం వుంది. కాని వాళ్లిద్దరికి ఆసంగతి తెలియదు. దాన్ని చూచాక తన ప్రాణం ఎలా రక్షింపబడిందా అని ఆలోచించి, భగవంతునికి ధన్యవాదా లర్పించాడు.

సర్వసుఖవిలాసాల్ని భారతదేశంకోసం త్యాగంచేసి, అహర్నిశలూ మహాత్ముని అడుగుజాడల్నే అనుసరించి స్వతంత్రభారతదేశానికి ప్రధానామాత్యుడై, ప్రపంచ ప్రజల మన్ననలను పొందుతున్నాడు. అట్టి ఆదర్శమూర్తి, త్యాగమూర్తికి భగవంతుడు ఆయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాక.

---

# అల్లరి పిల్ల

శ్రీమతి ఎమ్. పద్మావతీదేవి

"సుభా ! అబ్బ ఏమి అల్లరి చేస్తావే ! దీనితో వేగలేనమ్మా!" అంటూ రామలక్ష్మమ్మగారు విసుక్కుంటూ చీటికిమాటికి సుభను తిట్టుంది. సుభకు అంతంలేని అల్లరి చేయడంలో ఆనందం, అవివేకం, రెండు ఉన్నాయి. ప్రొద్దున్న లేచినదిమొదలు ఏదో సవరిస్తూ, ఎక్కడ ఏది కనపడితే దాన్ని కావాలంటూ మారాం పెట్టడంలో సుభకు పెట్టినదిపేరు. వస్తువు ఇవ్వడంలో ఆలస్యం చేసినా, అందక పోయినా, వీధీ వాడా అంతా దీని గోలకు, అలుపులకు. హడలిపోయి, జోహారుచేసి, గంగానమ్మకు, నూకాలమ్మకు మొక్కినట్టు, దానికి ఆ వస్తువుని, స్వాధీనంచేస్తారు. కానిని ప్రసంగంలో దింపేమా, ఇహ, ఎక్కడలేని ఊహాలు, మాటలు, పాటలతో విసుగువచ్చే వరకు, దాని ముద్దు మొద్దు అయే వరకూ అలాగే ఏకరువుపెట్టుంది.

దాని ప్రీతివస్తువు పంచదార. ఈ రేషనురోజుల్లో, పంచదార ప్రియంతోపాటు, దొరక్కపోవడం వల్ల, ఇంట్లో, చీమలుగాని, సుభగాని వాసన పట్టకుండా, దొరక్కుండా పెడ్తే, చీమలకు ఆచోటు తెలియకపోయినా, సుభమట్టుకి పసిగట్టి దానిని ఎలాగైనా తస్కరించి తిందామన్న అభిలాషతో ఇంట్లో వాళ్లు ఎవరు కనిపెట్టకుండా, పెట్టి మీద పెట్టి, దానిమీద బల్ల వేసి, డబ్బామూత ఎక్కి లాగి, చూస్తారేమో అన్న భయంతో, నోటినిండా బొక్కి కిందకి వెంటనే దిగలేక, గెంతలేక, అక్కడ్నుంచి వాళ్లమ్మను, నాన్నను గట్టిగా కేక వేసి, ఎవరూ రాకపోతే గొల్లుమని ఏడుపు ప్రారంభిస్తుంది.

సుభకు సరిగ్గా నాలుగుఏళ్లు నిండేయో లేదో గాని, దాని భావాలు, గీతాలు, వింటూంటే, క్రొత్తగా వచ్చినవాళ్లకు ముద్దుల మూటలు, కురిపించినట్టు చేస్తుంది. వాళ్లు కొంచెం చనువు ఇచ్చేరా, వాళ్ళ భుజం ఎక్కి తందనాలు త్రొక్కి, వాళ్ళను, అనవసరప్రసంగంలోకి దింపి, ఉక్కిరిబిక్కిరి చేసి, దాని ప్రశ్నలకు జబాబుచెప్పలేనంత చపటలను చేస్తుంది.

"అమ్మా! సుభా! కొంచెం బయటకు వెళ్ళి ఆడుకోవమ్మా!" అని వాళ్ళమ్మ అంటే దానికి పెడీమని జబాబుచెప్పి, ఉమ్మి, రక్కి, తాను అక్కడ వుండవలసిన అవసరం చూపిస్తుంది. వాళ్ళ నాన్నగారు ఇంట్లో వున్నంతసేపూ అనేకప్రశ్నలకు, జబాబులు చెప్పించి అతని ఓపికపోయేవరకు అరిపించి, తాను నవ్వుతుంది. ఆయన సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికి రాగానే, అనేకవికారాలు, చేష్టలు, వాళ్ళమీద వీళ్ళమీద నేరాలు చెప్పి, తానేమీ తప్పు చేయనట్టు సర్దుకుంటుంది.

వాళ్ళ నాన్నగారు దీనికి చదువు చెప్పిద్దామన్న కుతూహలంతో ఒక మేష్టగాని కుదిర్చేరు. ఆ మేష్టరుగారి ముక్కు, నోరు, కొంచెం పెద్దవి అవడంవల్ల, ఆయన కొంచెం కురచగా వుండడంబట్టి, ఆయన్ని కోతిని చేసి, వచ్చినదగ్గిర్నుంచి, ఆయన ముక్కూ, జుత్తూ, చెంగూ లాగి, ఆయన్ని తరుముతుంది. ఆ మేష్టరు వచ్చేజీతానికి దండం పెట్టి మానుకున్నాడు.

ముద్దుగా ముచ్చటగా, ఇంట్లో పెరగడంవల్ల వాళ్ళ అమ్మమ్మ దీన్ని ఎంతో ఆప్యాయంగా పెంచేది. ప్రతీదానికి ఆమెదగ్గిరకు పరుగెడ్తుంది అమ్మమ్మగారిక్కి ఘోరమైనమడి. "సుభా ! నేను మడి కట్టుకున్నాను, నన్ను తాకకమ్మా !" అని ప్రేమతో చెప్తే "నేనుమట్టుకి మడికదూ, పిల్లలు దేముళ్లని నీవే చెప్పేవుకదూ, అమ్మమ్మా" అని ఆమెని తాకి తందనాలు త్రొక్కి, ఆమెని ఏడిపించేటంత పని చేసి, ఆమెచేత కసుర్లు తింటుంది. దాని తల్లిదండ్రులు అనేకవిధాలుగా పిల్లని సరిగా త్రోవకు తీసుకొద్దామని ప్రయత్నించేరు కాని లాభం లేక పోయింది. ఇహ చేసేదిలేక "నర్సరీ" స్కూల్లో చదువుకి ప్రవేశపెట్టేరు. అక్కడ తనకు తెలిసినవారు లేక పోవడంవల్ల అంతా అగమ్యగోచరంగా తోచి ఇంటికి తిరిగివచ్చే వరకు ఏడ్చేది. అలాగా రోజూ స్కూలికి తప్పనసరిగా పంపించడం వల్ల స్కూల్లో తనఈడుపిల్లలు, వాళ్ళ చేష్టలు, స్నేహం కలియడం వల్ల స్కూలుగంట కొట్టేవరకు ఇంటిమాట మర్చిపోయి వాళ్ళతోనే వుండిపోయేది.

(34-వ పేజీ చూడుడు)

# రుద్రమదేవి

(14-వ పేజీ తరువాయి)

చేయగా వారలికి వెళ్ళిపోయిరి. రుద్రమహారాజు ప్రశ్నించుచుండగా నాతడు వినీతుడై యుత్తరము లిచ్చుచుండెను.

"నీ పేరేమి?"

"పాలవీరుడు, మహారాజా!"

"ఊరు?"

"విక్రమసింహులగు తమ కేమని విన్నవించుకొనగలను?"

"నీవీ సేన కెట్లధిపతి వైతివి?"

"అంబదేవుని యనుగ్రహముచే, మహారాజా!"

"నిన్ను చెరలో నుంచుటకు కారణమేమో ఎరుగుదువు గదా!"

"తమ అనుగ్రహము, మహారాజా!"

"నీవు అన్నమంత్రికి ఉత్తరములు వ్రాసితివిగదా!"

"లేదు, మహారాజా!"

"తిక్కన సోమయాజులకు"

"వా రెక్కడ నున్నారో కూడ నాకు తెలియదు మహారాజా! ఆ పూజ్యపురుషుడు క్షేమముగా నున్నాడా?"

"మారనకు నీవు వ్రాసిన యుత్తరము జ్ఞాపక మున్నదా?"

"మారన ఎవరు, మహారాజా?"

"మంచిది. నీవు సార్థవాహులద్వారా ఏకశిలానగరములో నెందరు మంత్రీశ్వరుల కుత్తరములు వ్రాసితివో గుర్తున్నదా?"

"ఎప్పుడు మహారాజా!"

"చెప్పెదము. అవి యన్నియు నీకు చూపియే చెప్పెదము. ఏకశిలానగరమున నిన్ను పూర్తిగా విచారింతుము!"

"మహాప్రసాదము, మహారాజా!"

"నీవు మున్నేమి చేసినను ఏకాదశినాటి యుద్ధములో చేసిన రాజసేవచే ప్రీతుల మైతిమి. అందుచే నిన్ను కొంత కరుణతో చూడ దలంచితిమి. నీవు వర మేదైన కోరుకున్న నాలోచింతుము!"

"మహారాజులు సంపూర్ణముగా నన్ను విచారించుటయే నేను కోరికొను వరము! అయినను నేను కోరుకొనున దొకటి యున్నది. ఆ పాలకుర్రమును నాతోపాటు చెరలో నుంచవేడెదను."

రుద్రమ్మ యాశ్చర్యపడెను.

"తిర్యగ్జంతువగు నా కుర్రముపై నీ కంత యభిమాన మేల?"

"పూర్వజన్మానుబంధము! అది నాకు తల్లి! నేను దాని బిడ్డను—"

పాలవీరుని కంఠము గద్గద మయ్యెను. కన్నుల నీరు గిర్రున తిరిగెను.

"నీ కోరిక తీర్చెదను!"

ఇట్లనుచు నాతని దిసికొనిపోవ భటుల కాజ్ఞాపింప నారట్లే చేసిరి!

* * * *

కొప్పెరుంజింగడును స్వస్థుడయ్యెను. అతని విచారణ మరియొకవిధముగా నా మహానాడే జరిగెను.

శ్రీరుద్రదేవమహారాజు దక్షారామభీమేశ్వరుని యాలయావరణమున పేరోలగ ముండెను. జన్నిగదేవ పలువురు సేనానులు మంత్రులును సామంతులును మహారాజులను కొలిచియుండిరి. విద్వాంసులగు భూసురులును ఆశీర్వచనార్థ మచ్చట నుండిరి. [illegible] నయము గలదు.

ఆ మహాసభలోనికి భటులు బంధితులైన కొప్పెరుంజింగని, నాతని ప్రధానకాడవసేనానులను దెచ్చి నిలువబెట్టిరి. వారి కందరకు శిరస్సులపై దీర్ఘములగు కేశములు కలవు.

వారిని విచారించుట ఎక్కువసేపు పట్టలేదు. వారు కేవలము శత్రువులై ఆంధ్రభూభాగముపై నకారణముగా దండెత్తివచ్చిరి. వారి సాహసముచే నంధ్రవీరులు పలువురు వీరస్వర్గము నందిరి. రాజకోశమునుండి ధనము విశేషముగా వెచ్చింపబడెను. వారి కేమి శిక్ష విధింపవలె ననునదియే ప్రశ్న!

శ్రీ రుద్రదేవమహారాజు కొప్పెరుంజింగనే ప్రశ్నించెను:

"నీకు మే మెట్టి శిక్ష విధింపవలెనో ఎరుగుదువా?"

కొప్పెరుంజింగడు నిర్భయముగా ప్రత్యుత్తర మిచ్చెను. అతని నిలకడలోని ఠీవి యా సభ నెల్ల నాకర్షించెను.

"మహారాజా, మీచే మేము విజితుల మైతిమి. అంతకంటె వేరు శిక్ష మాకే ముండగలదు? మా ప్రాణములు మీ యధీనములు!"

సభయంతయు నిశ్శబ్దమయ్యెను. ఇట్టివాని కేమి శిక్ష వేయు నగును? శిక్షింపకున్న నితరులకు భయముండు నెట్లు?

శ్రీ రుద్రదేవమహారాజుల యాజ్ఞచే వారందరికి సభ్యాగ్ర శిరస్సులు ముండనములు చేయించి స్నానములు చేయించి భటులు మరల సభలోనికి తెచ్చి వారిని నిలువబెట్టిరి. మహారాజు కొప్పెరుంజింగనితో నిట్లనెను:

"కాకతిరాజేంద్రులకు యావజ్జీవము సామంతుడనుగా నుందు నని భగవత్సాక్షిగా నీవు ప్రమాణము చేసినచో నిన్ను నీ సేనానులను ప్రాణములతో వదలెదము!"

"చిత్తము, మహాప్రభూ!"

వెంటనే కొప్పెరుంజింగని ఇష్టదైవ మగు కనకసభాపతి విగ్రహమును కొప్పెరుంజింగని పురోహితునిచేతనే తెప్పించి దక్షారామభీమేశ్వరలింగముపాదసన్నిధి బెట్టించిరి.

కొప్పెరుంజింగడు మున్ముందు మహాదేవునికి ప్రదక్షిణము చేసి, ఈశ్వరసముఖమునను, భూసురుల సముఖమునను, మహాసభాసముఖమునను, కాకతిగణపతి సేవపాదారవిందదాసుడనై యుందు నని ప్రతిజ్ఞ చేయుచు శ్రీ రుద్రదేవమహారాజుల పాదపీఠము నందు శిరము గదియించి మ్రొక్కెను. మరియు నా సభాసమయమున, భీమేశ్వరస్వామి కాతడొక కనకప్రభదానము చేసి, యాలయమున యాచంద్రతారార్కముగా 'కాకతిగణపతిపాదారవింద [illegible] యనూన మానసేవ రాజసింహన—' ఇత్యాదిగా నొక శాసనము వేయించెను.

ఇందరు కాడవసేనానులును పట్టువడిన భటులును ఏమగునట్లు? వారి నందర నొక్కసారిగా వారిస్వదేశమునకు పోనిచ్చుట క్షేమము కాదు. వారిని చెరలో పట్ట శక్యము కాదు. అందరును రాజ్యపు పరిహద్దులు దాటిపోవువరకు కాపుండి పంపుట బహువ్యయప్రయాసలతో కూడిన పని. ఆ పట్టువడిన సైనికులలో కొందరు వంశపారంపర్యముగా యుద్ధమున కలవాటుపడినవారు. అట్టివారిని రుద్రమ తన సేనలలో చేర్చుకొనుటకు సమ్మతింపగా, వారును దానికి సంతోషముతో నంగీకరించిరి. మిగిలినవారు పలువురు యుద్ధముల కలవాటు

పడినవారు కారు. వారు ప్రధానముగా కర్షకులు. ధనాశచే వారు రాజసింహుని సేనలో చేరి యుద్ధకౌశల మభ్యసింపసాగిరి. కాని వారి చేతులలో, ఖడ్గములును ఖడ్గములవలె గాక, హలములవలెనే కదలుచుండెను. అట్టివారికి గోదావరీతీరమునను కృష్ణాతీరమునను దున్ని పండించుకొనుటకు చిన్న చిన్న భూఖండము లిచ్చుటకు శ్రీ రుద్రదేవమహారాజులేర్పాటు చేసిరి. వారు ఆంధ్రభూమిలో అరవపల్లెలు స్థాపించిరి. వారి యింటిపేరు అరవవారని స్థిరపడినది. వారిక్కడి కాపులలో కలసిపోయిరి. . .

. . కొప్పెరుంజింగడు తనవెంట నెందరో ద్రావిడ ఋత్విక్కులను తెచ్చియుండెను. వారందరును తమ కుటుంబములతో సాగ్నులై వచ్చినవారే! రమారమి రెండువందలవరకు ఆ కుటుంబము లున్నవి. కొప్పెరుంజింగని శిబిరమును పట్టుకొనినప్పుడు ఆ ఋత్విక్కులను జన్నిగసేనలు నిర్బంధింపలేదు. కాని వారికి ఆశ్రయము పోయినది. ద్వాదశినాటినుండియు నరసాపురమునకు సమీపమున గల యగ్రహారముల బయటనున్న యారామక్షేత్రములలో వారు నివసించుచు, నెట్లెట్లో కాలము గడుపుచుండిరి. శ్రౌతస్మార్తవిదులగు నందరు బ్రాహ్మణులు తమ కుటుంబములతో నిక్కట్లు పడుచుండుట గోదావరీతీరబ్రాహ్మణులకు బాగుండలేదు. వారు ఎన్ని కుటుంబముల నెంతకాలము పోషింపగలరు? విజయోత్సవములు సాగుచున్న సమయమున, ఆ ద్రావిడులలో పెద్దలను వెంటతీసికొని గోదావరి పండితులు పలువురు శ్రీ రుద్రదేవమహారాజును దర్శించిరి. వారిలో కేతనయు గలడు. కేతనయే దాని కంతకును కారకుడు. కేతన యా ద్రావిడబ్రాహ్మణులు ఆ రామక్షేత్రములలో నల్లాడుచుండుట మహారాజులకు నివేదించెను. "విద్వాంసులును, తపస్సంపన్నులును, అగు నందరు బ్రాహ్మణులు నిలువనీడలేక బాధపడుచుండుట ఈ దేశమునకును తత్పరిపాలకునకు క్షేమముకాదు!" ఆ ఛాందసకవి యంతమాటయు ననివేసెను. శ్రీ రుద్రదేవమహారాజులు కోపింతు రని మిగిలినవారు భయపడిరి.

కాని మహారాజులు కోపింపలేదు. స్థానికులగు నధికారులను వారికి వసతి యెక్కడ కల్పింపదగునో, యని వెంటనే విచారించిరి. తుదకు సర్వవిధముల ననుకూలముగా నుండుటచే, ఆ ద్రావిడ బ్రాహ్మణులకు శ్రీ రుద్రదేవమహారాజులు తమ విజయయాత్రకు చిహ్నముగా కౌకరపర్రు అగ్రహార మొనర్చి దానముచేసిరి. వచ్చిన ద్రావిడబ్రాహ్మణులును కేతన మొదలుగా నితర గోదావరిబ్రాహ్మణులును శ్రీ రుద్రదేవమహారాజులకు విజయపరంపరలు కలుగుగాతి మని యాశీర్వదించి సెలవు గైకొనిరి. అంతటితో నా ద్రావిడబ్రాహ్మణులకు ఆరామక్షేత్రములలో నలమటించవలసిన దురవస్థ తప్పిపోయినది. స్థిరవసతి యేర్పడినది. కాని గోదావరీబ్రాహ్మణుల జిహ్వాగ్రములలో మాత్రము వారికి ఆరామద్రావిడులను నామము శాశ్వత మయ్యెను.

* * *

ఆపిమ్మట రెండురాత్రులు చాల ప్రొద్దుపోవువరకు శ్రీ రుద్రదేవమహారాజులు తన ప్రధానదండనాథులతో నేకాంతమున మంత్రించిరి. అందులో జన్నిగయు అదిదమ్మయు నుండిరి. కోలని రుద్రుడుకూడ పిఠాపురమునుండి ప్రత్యేకముగా నాహ్వానింపబడియుండెను.

ఆ ఏకాంతసభలో ఏకశిలానగరమునుండి వచ్చిన వార్తలును, గొంటూరునుండి అంబదేవుడును మోటుపల్లినుండి త్రిపురాంతకుడును పంపిన వార్తలును చర్చించిరి. వానిలో పరస్పరవిరోధము కొంచెము భాసించెను. ఐనను ఆ వార్తలు నిజము కాకుండుటకు వీలులేదు. సభాంతమున రుద్రదేవు డీ విధముగా నిశ్చయించెను:

"జన్నిగ వెంటనే మహాసైన్యము కదలించుకొనిపోయి సుందరపాండ్యుని సేనలపై విజృంభింపవలెను. కోలనిరుద్రుడు వెంటనే కాళింగసేనలను తాకవలెను; అప్పుడే కోరంగినుండి మహానౌకాబలము బయలుదేరి కాళింగుల నౌకాబలములను వాని రేవుపట్టణములందే ముట్టడించవలెను. తిక్కచమూపతి ఆగ్నేయమునుండి వచ్చుచున్న చోళసైన్యములను, గోన గన్నారెడ్డి నైరృతినుండి వచ్చుచున్న బల్లాలకర్ణాటసేనలను, రెండుమహాసైన్యములతో వెంటనే పోయి ఎదుర్కొనుటకు ఆజ్ఞలు ఏకశిలానగరమునకు శీఘ్రచరులచే పంపవలెను!"

ఈ నిర్ణయములకు కొంత సందేహము సూచించినది ఒక్క కోలనిరుద్రుడే! 'ఓరుగల్లునుండి ప్రధానసేన లన్నియు వెడలిపోయిన పురరక్ష యేది? దేవగిరినుండి యాదవప్రభువు దండెత్తివచ్చిన నేమి యుపాయము?'

ఆ భయములేదు. యాదవులు తమ రాజ్యముపై నెత్తివచ్చుచున్న ముసల్మానుసేనలకు తమ రాజ్యము వదలివేసి ఓరుగల్లుపైకి రాగలరా? ఓరుగల్లునందే ఈ నూతనమతస్థులు నెమ్మదిగా ప్రవేశించుచున్నారు. జీవనోపాధిలేని పేదలవలెను, నికృష్టజీవనములు జరుపు నల్పులవలెను, ఇప్పటికి ఎందరో ఏకశిలానగరమున వారున్నారు. వారిని చారులు కనిపెట్టుచుండవలసినదే కాని, మహారాజులు తమ దేశములో ప్రవేశింపకుండ నెట్లు నిషేధింపగలరు? అట్టివారు ఇంకను సమీపమున నున్న దేవగిరిపై తమ దృష్టి సారించియుండుట సహజము. దేవగిరియు ఏకశిలయు ఏకమై యున్నగాని, ఎప్పటికైన ఆ భయము ఉభయులకును తప్పదు!

ఇట్టివిధముగా కోలనిరుద్రుని సందేహములను తక్కినవారు వారించుచుండిరి. ఏమైన నేమి? నిశ్చయము లైపోయినవి! రాజాజ్ఞలు ప్రవర్తింపబడినవి!

* * * *

కోలనిరుద్రుడు ప్రస్థానభేరి వేయించి యా మరునాడు సాయంత్రము గోధూళిలగ్నమున మహాసేనతో కాళింగులపైకి శీఘ్రయానమున సాగెను. వ్యాకరణబ్రహ్మ యగు నాతని రణభేరియు చిత్రముగా ధ్వనించి చుట్టుపట్టుల నున్న విద్వజ్జనముల నానందపరవశుల గావించెను.

"అఇఉణ్|| ఋఌక్|| ఏఓఙ్|| ఐఔచ్|| హయవరట్|| లణ్|| ఞమఙణనమ్|| ఝభఞ్|| ఘఢధష్|| జబగడదశ్|| ఖఫఛఠథ చటతవ్|| కపయ్|| శషసర్|| హల్||"

రుద్రుని రణభేరియు, సంధ్యానాట్యము చేయుచు మహారుద్రుడు తన ఢక్కపై పదునాలుగుమారులు వినదింపజేసిన యక్షరములే చిత్రముగా ధ్వనించెను.

కోరంగి నావలును మనోజ్ఞ శ్రుతితో కదలెను.

జన్నిగసేనలును మరునాడు ఉదయమున సాగిపోయెను.

విజయోత్సవములు పూర్తిచేసి శ్రీ రుద్రదేవమహారాజులును సపరివారముగా దారిలో ప్రజల క్షేమ మరయుచు ఓరుగల్లుకు తిరుగు ప్రయాణము సాగించెను.

---

# పంజర విముక్తి

(15 వ పేజీ తరువాయి)

'ఆపొలం నాపేర వ్రాస్తే బాగుంటుంది.. ఎందుకంటే, ప్రభుత్వంవాళ్ళు ఆ ఆస్తిని జప్తు చేయడానికి అవకాశం లేకుండాపోతుంది! స్త్రీ ధనంజోలికి ప్రభుత్వం రాదట!' అన్నది శకుంతల. నారాయణకు భార్య మాటల్లోని గూఢార్థం బోధపడింది. 'నా పేర నున్న పొలంతాలూకు డబ్బే నేను వాడుకోవడానికి వీలుకానప్పుడు. అది నీపేర పెడితే — ఇక నాకందులో కానీకూడా ఇవ్వడు మీనాన్న. నీవు మాట్లాడినమాటలు నీ స్వంతంకావు, మీ నాన్న చెప్పినవి. నా ఆస్తి ఎవరిపేరా రాయను. నేను రాజకీయాల నుండి విరమిస్తే — ఇంకా ప్రభుత్వం నాజోలికెందుకు వస్తుంది?' అన్నాడు నారాయణ.

'మీరు రాజకీయాలను విడిచిపెట్టలేరన్నాడు మానాన్న! రాజకీయాలలో దిగినవాళ్లు — నాటకాలవాళ్లు — సంగీత పాటకులు — అదొక వ్యసనమై ఇంకోపని చేయలేరని మానాన్ననమ్మకం. ఆయనకు ప్రపంచానుభవము బాగావుంది!' అన్నది శకుంతల.

'నీ బొంద! నీ మనస్సంతా పాడుచేశాడు. నీలో విప్లవభావాలన్నీ రూపుమాపాడు. నీవు వీరపత్నిగా మాట్లాడటంలేదు. వొట్టి పిరికిపంద వైనావు. నా శకుంతల గొప్ప విప్లవ భావాలు గలదని నేను జెల్లో స్నేహితులకు కూడా చెప్పాను. నివుకూడా జయిలుకు వస్తావనుకున్నాను. పెట్టుబడిదారు కూతురివి — నీవు జయిలుకెందుకు వస్తావు? హాయిగా పుట్టింట్లో కూచున్నావు. ఈ మాటలకేంగాని — మీ అమ్మతో చెప్పి ముందు అయిదువంద లిమ్మని చెప్పు. లేదా — పొలం తాకట్టు పెట్టో — అమ్మివేసో డబ్బు తీసుకపోతాను. పొలం నాది!' అన్నాడు నారాయణ ఉద్రేకంతో

నారాయణ పార్టీలో చేరిన తొలి దినాలలో భార్యనుకూడా వెంట తీసుకవెళ్లాలని ప్రయత్నించాడు. కాని శకుంతల తండ్రిమీద ఎక్కువ విశ్వాసం కలది కావటంవలన ఆ ప్రయత్నం సాగలేదు. శకుంతల తన భర్తభావాలు తండ్రికి తల్లికి చెప్పింది.

'ఏడి కప్పెవ డిస్తాడు? కొడుకు పైనరు ఆస్తి అమ్మితే ఎవడూ కొనడు. కొడుక్కి సగంపొలం రాసిచ్చి భార్యకుకూడా జీవనోపాధి చూపించి మిగతాదిమాత్రం అమ్ముకోడానికి అతనికి వీలవుతుంది.' అన్నాడు రామసుబ్బయ్య భార్యతో కూతురు శకుంతలతో. నారాయణ గ్రామంలో అప్పుకోసం కొందరివెంట తిరిగాడు. కాని అతని ప్రవర్తన తెలిసినవారందరూ నిరాకరించారు. అప్పుపుట్టకపోయేసరికి పొలమే అమ్ముతానన్నాడు. రామసుబ్బయ్య ప్రాపకంవలన పొలానికి కూడా బేరంరాలేదు. నారాయణకు ప్రతిదినం అపల్లెటూరులో ఒకక్షణం యుగంగా గడుస్తోంది. భార్య నగలైనా అడిగి తీసుకుందామనుకుంటే. ఆ నగలన్నీ అమ్మి సొమ్ముచేసుకుని తండ్రివద్ద దాచుకుంది శకుంతల. పిల్లవాడిభవిష్యత్తుకూర్చి రామసుబ్బయ్య సలహాతోనే ఆపని జరిగింది. నారాయణ వచ్చి వారం దాటిపోయింది. ఎక్కడా అప్పుపుట్టలేదు. పొలంకొనడానికి ఎవడూ ముందుకురాలేదు. నారాయణ ఆశ్చర్యానికిఅంతులేకపోయింది. ఇక మార్గాంతరంలేక అతను అత్తగార నడిగాడు: 'మీరైనా చెప్పి మామయ్యచేత నాకో అయిదువందలిప్పించండి. నే నవసరంగా బొంబాయి వెళ్లాలి,' అన్నాడు

రామసుబ్బయ్య ఆమాటలు విని 'మిగిలిన మూడెకరాలు నీభార్యపేర రాసేస్తే, నీ విష్యవలసిన వెయ్యిరూపాయల బాకీ రద్దుచేసి, నీవు కావాలంటున్న అయిదువందలు తీసుక పోదువుగాని. దానితో ఆఖరు. ఇక నీవు ఈవూరురావడానికి నీకేం పని వుండదు. నిక్షేపంలాంటిభార్య, పిల్లవాడిని విడిచి నీవు దేశసేవచేస్తూ ఆస్తినంతాపాడుచేస్తూంటే ఇక చూచివూరుకోడం నాకు భావ్యం కాదు!' అన్నాడు. నారాయణ డబ్బవసరం వలన పొలం భార్యపేరపెట్టి అయిదువందలు తీసుకోడానికి కృతనిశ్చయుడైనాడు. అతనికి మార్గాంతరం కన్పించలేదు.

ఆ విధంగా నారాయణచేత మూడెకరాల పొలం సర్వహక్కులతో శకుంతలపేర వ్రాయించి రిజిస్టరు చేయించి, వెయ్యిరూపాయల బాకీపోను అయిదువందలు రూపాయలు అల్లుడికిచ్చాడు మామగారు. ఆ అయిదువందలు నారాయణకు 5 లక్షల రూపాయలుగా కనిపించినయి. అతడానందంతో ఆ డబ్బుతీసికొని ఆసాయంత్రం గ్రామం నుంచి బయలుదేరిపోతూ, భార్యతో 'మీనాన్న బతికుండగా మళ్లీ యీయింట్లో పాదం పెట్టితే ఒట్టు,' అరుణకు



400, 741 మంది కాందిశీకులకు ఆశ్రయ మివ్వటానికి అమెరికా నిర్ణయించింది. ఆ శాసనంమీద అధ్యక్షుడు ట్రూమన్ చేవ్రాలు చేస్తున్నారు.

జాగ్రత్తగా పెంచి చక్కగా చదివించి పెద్దవాణ్ణి చేసే బాధ్యత నీకు వప్పగిస్తున్నాను. నేను బ్రతికుంటే మళ్ళీ కలుస్తాను, నేను మరణిస్తే నాకోసం నీవేమీ విచారపడనక్కర లేదు. నా అభిప్రాయంలో నీవు నీతండ్రి పక్షాన చేరినా కపటాలను చేసినందుకు నేను సిగ్గుపడను. నేను దేశసేవలో మరణిస్తే నాకింకేం కావాలి!' అని దగ్గుత్తికంఠంతో అన్నాడు. అత్త, మామ ఆమాటలు విని పూరుకున్నారు. శకుంతల భర్తమాటలువిని అవి అంత్యసందేశంగా భావించి కళ్లనీళ్లు విడిచింది.

నారాయణ కుమారుణ్ని ముద్దాడి, 'అరుణా! నీవైనా సన్మార్గవర్తనుడివై, ఉద్యోగివై బాగా డబ్బు సంపాదించి మీ అమ్మని సుఖపెట్టు. నేను దురాత్ముణ్ని. నాకోసం దిగులుపడకు. మీ అమ్మమ్మ, తాతా నీ సౌన్నత్యంకోరి నిన్ను ఉచ్చదశకు తీసుకవస్తారు. నేను మరణించినా నీవు విచారపడనక్కరలేదు. నీతండ్రి వీరుడై దేశంకోసం తన ప్రాణాలు ధైర్యసాహసాలతో విడిచినట్లుగా జ్ఞాపక ముంచుకో!' అన్నాడు.

ఆ మాటలు వినేసరికి వరలక్ష్మమ్మకుకూడా కంటినీరు స్రవించింది. నారాయణ వెళ్లిపోయాడు. ఆ సంధ్యాసమయారుణకాంతులతన్ని రూక్షవీక్షణాలతో తిలకించాయి.

పదిరోజులు గడిచాయి. ఒకనాడు దినపత్రికలో ఇలా ప్రకటింపబడినది. 'వరంగల్ జిల్లాలో పోలీసులకు కమ్యూనిష్టులకూ సంఘర్షణ జరిగింది. అందులో పోలీసుల తూపాకీగుళ్లు తగిలి కమ్యూనిష్టులు మరణించారు. ఆ గుంపులో ఇటీవల పార్టీనుంచీ రాజీనామా నిచ్చిన ప్రముఖకమ్యూనిష్టు నారాయణకూడా వున్నాడు!' అని.

ఆ పత్రికాప్రకటన చదివి శకుంతల శోకభారంతో కూలిపోయింది. రామసుబ్బయ్యగారు గ్రంథం(?) ఆశ్చర్యంలో మునిగిపోయి - 'వాడి కథ యిలా విషాదాంతమవుతుందని నాకు తెలుసు. వాడు విడుదలయింది యిందుకోసమే! అమ్మాయీ! నీ వేడవడం అనవసరం! వాడు నామీద కోపంతో తన మనుష్యుల్ని వెంటపెట్టుకుని వచ్చి నన్ను చంపుతాడని నేను భయపడని క్షణంలేదు. వాడు బ్రతికియుండీ, నీకుగాని నీ కొడుక్కిగాని వుపయోగించేదిలేదు. చిన్నప్పటినుంచీ నావద్ద పెరిగినవాడికి చివర రోజుల్లో నామీద గౌరవమే లేకుండాపోయింది!' అన్నాడు.

'తాను చస్తానన్న జ్ఞానంతోనే పెళ్లానికి కుమారుడికీ ఆఖరి వీడ్కోలిచ్చి మరీ పోయాడు!' అన్నది వరలక్ష్మమ్మ. గ్రామంలో చుట్టాలెందరో వచ్చి రామసుబ్బయ్యను, భార్యను, కూతురు శకుంతలను, పరామర్శించి వెళ్లారు. తన భర్త దేశంకోసం మరణించలేదని అజ్ఞానంవల్ల మరణించాడని శకుంతలకు తెలుసును. ఆమె తన కుమారుడిని చూచుకుంటూ జీవిస్తోంది.

## అల్లరి పిల్ల

(30-వ పేజీ తరువాయి)

ఇంటికి రాగానే స్కూల్లో వింతలు, విశేషాలు, మేష్టర్ల బోధన ఆటలు, పాటలు-అంతా ఒక్కసారి చెప్పడానికి మొదలుపెట్టి చెప్పలేక ఒక్కొక్కటి జ్ఞాపకంవచ్చి చెప్పేవరకు ఇతర్లను ఓపికతో వినమని, తాను అలసిపోయేది. భోజనం అవడంతడువుగా, నిద్రాదేవత కళ్లముందు ఆడ్డంవల్ల, పక్కమీద బోర్లపడుకొని నిద్రిస్తుంది. ఇప్పుడు అల్లరి, దుండగాలు చేయడం ఏమిటో మర్చిపోయి ఎవరైనా అల్లరిచేస్తే తాను విసుక్కుంటుంది. ఇంట్లో అందరు విస్తుపోతారు. సుభ ఇలా మారిపోవడం అందరికి ఆశ్చర్యం.



బ్రస్సెల్సులో లియోపాల్డు సన్మతికై ప్రదర్శనం. ఈ ప్రదర్శనంలో 50 వేల మంది సోమశీలురు పాల్గొన్నారు. ఈ ప్రదర్శనకారులు యువరాజుకూ, కీర్తిశేషులైన ఆయన తాతముత్తాతలకు జోహారులర్పిస్తూ వారి చిత్రాలను ఊరేగించారు.

# జనరల్ డగ్లస్ మెకార్థర్

(7-వ పేజీ తరువాయి)

డగ్లస్ మెకార్థర్ జీవితాన్ని దిద్దుకుంటూ వచ్చాడు.

ఫిలిప్పైన్స్‌లో ప్రారంభమైన సైనిక జీవితం ఆసియాపైన లక్ష్యాన్ని కేంద్రీకరించింది. రష్యా - జపాన్ యుద్ధం అనంతరం డగ్లస్ మెకార్థర్ ఆసియాలోని సర్వదేశాలనూ పర్యటించాడు. అమెరికాలో జాతీయ రక్షణదళాధిపతిగా 1917 లో నియమితుడైనాడు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఫ్రాన్స్‌లో పోరాడి రెండు పర్యాయాలు గాయపడ్డాడు. యుద్ధానంతరం 37 దేశాలు డగ్లస్ మెకార్థర్‌కు సైనికపతకాలిచ్చి సన్మానించాయి. యుద్ధానంతరం జర్మనీలో ఆక్రమణ సైన్యంలో ఉన్నాడు. 1921 లో ఫిలిప్పైన్స్ దీవులకి అమెరికన్ ప్రభుత్వం చేత పంపబడ్డాడు. 1930 లో అమెరికన్ సైనిక శాఖ సర్వాధికారిగా నియమితుడైనాడు. ఇంత చిన్న వయస్సులో సైనిక సర్వాధికారిగా నియమితుడైన ఉద్యోగి అమెరికాలో మరొకడు లేడు. కార్యదక్షుడైన డగ్లస్ మెకార్థర్ నాలుగేళ్ళ పదవీ నిర్వహణ అనంతరం రూజ్వెల్ట్ చేత మరి నాలుగేళ్లు నియమింపబడ్డాడు.

మొదటి ప్రపంచయుద్ధం అంతమై చాలకాలమైనప్పటికీ, రెండో ప్రపంచయుద్ధం మాట ఎవరిబుద్ధికీ తోచనప్పటికీ, డగ్లస్ మెకార్థర్ రూజ్వెల్టుతో వాదించి దేశాన్ని సాయుధసైనికసమాయత్తం చేశాడు. ఆ పదవినుంచి 1935 లో విరమించగానే ఫిలిప్పైన్స్‌లో ప్రభుత్వానికి సైనిక సలహాదారుగా నియమితుడైనాడు. ఈ పదవిని తానై కోరి వెళ్లాడు. మరొకర్ని పంపడానికి అమెరికాలో ఎవరికీ సాహసం లేకపోయినది. అయిదేళ్ళలో ఫిలిప్పైన్స్‌లోని అమెరికన్ సైనికబలాన్ని పునర్నిర్మించాడు.

రెండో ప్రపంచయుద్ధం జపాన్ అమెరికాపై యుద్ధం ప్రకటించగానే తూర్పు ఆసియాలోని అమెరికన్ సైన్యాలకు సర్వసైన్యాధిపతిగా నియమితుడైనాడు. ఫిలిప్పైన్స్‌లో పదిరెట్లు శత్రుబలాలతో నిలిచి మూడుమాసాలు పైగా పోరాటం జరిపాడు. ఫిలిప్పైన్ ద్వీపవాసులు కుట్రపన్ని హత్యచెయ్య సంకల్పించారని రూజ్వెల్టు స్వయంగా హెచ్చరించేవరకూ మెకార్థర్ రణరంగాన్ని విడిచిపెట్టలేదు. అరణ్యాల్లో కొండల్లో దాగి కొన్నాళ్లు గొరిల్లా యుద్ధం కూడా జరిపాడు. రూజ్వెల్టు సలహాపైన ఫిలిప్పైన్స్ విడిచి ఆస్ట్రేలియా పారిపోయాడు. సిడ్నీలో ఉండి మిత్రరాజ్యసైన్యాల కధిపతియైనాడు. జపాన్ ఓటమితో తూర్పు ఆసియాలో మిత్రరాజ్యసైన్యాల అధిపతిగా మిలిటరీ ప్రభుత్వం స్థాపించాడు.

మెకార్థర్ మాటకి నాడు అమెరికాలో తిరుగులేదు. ప్రభుత్వం అతని సంకల్పాన్ని గ్రహించి ఆ ప్రకారం ప్రవర్తిస్తుంది. కాని లూయి జాన్సన్ దేశరక్షణశాఖామంత్రి అయిన తరువాత స్వల్పంగా అప్పుడప్పుడు అభిప్రాయభేదాలు సంభవించేవి. జపాన్‌లో కార్య నిర్వహణలో బాధ్యత వహించవలసిన అన్యదేశాల అధిపతులకు మెకార్థర్ నిరంకుశ చర్యలు నచ్చలేదు. బ్రిటన్ రష్యా ఆస్ట్రేలియాలు అనేకవిషయాల్లో మెకార్థర్ పట్ల అసంతృప్తి ప్రకటించి అమెరికన్ ప్రభుత్వానికి ఫిర్యాదు చెయ్యవలసివచ్చింది. కాని ఇవి బయటికి పొక్కకుండా అమెరికన్ ప్రభుత్వం కాపాడుకుంది.

జపాన్ ప్రభుత్వానికీ, ప్రజలకీ "ప్రజాస్వామ్యరీతిని నేర్పడంలో" అనే వార్లు అభిప్రాయభేదాలు వచ్చాయి. అమెరికన్ ప్రభుత్వాజ్ఞ లేకుండానే జపాన్ ప్రభుత్వానికి పార్లమెంట్‌కి అధికపాలనాధికారాలిచ్చాడు. అప్పుడు అమెరికన్ ప్రభుత్వం సంజాయిషీ అడిగింది. స్వదేశం రావాలని ఆజ్ఞ యిచ్చినది. కాని మెకార్థర్ నిరాకరించాడు. 1937లో ఫిలిప్పైన్స్ చేరినది మొదలు ఇంతవరకూ స్వదేశం వెళ్లలేదు. యుద్ధంలో మొదట పరాజయం ప్రాప్తించినది మొదలు, జపాన్ దేశానికి గుణపాఠం చెప్పేవరకూ స్వదేశంలో అడుగుపెట్టరాదని మెకార్థర్ ప్రతిజ్ఞ పూనాడని అతని మిత్రులు కొందరు చెప్తారు. మెకార్థర్ నిరాకరించినా బహిరంగంగా ప్రభుత్వం విమర్శించలేక పోయినది. అసలు రమ్మని పిలువనేలేదని ప్రభుత్వం చెప్పింది.

మెకార్థర్‌తో సంప్రదించాలంటే అమెరికన్ ప్రభుత్వమంత్రులు అతనివద్దకు వెళ్ళవలసిందేగాని అతను వారివద్దకు వెళ్లడు. మొదట కోపించిన జాన్సన్ క్రమంగా మెకార్థర్ ఆసియాలో సాధించదలచిన కార్యాన్ని గ్రహించినాడు. అతనిపట్ల గౌరవభావం అధికమయింది. విదేశాంగ మంత్రి ఎచిసన్‌కి మెకార్థర్ పట్ల ప్రశంస అసాధారణం. జపాన్‌లో మెకార్థర్ ఏది చేసినా ఏది చెప్పినా సవ్యంగానే ఉంటాయని అతని గాఢ విశ్వాసం. కాని ముఖాముఖి మాట్లాడడు. ఉభయుల అహం సమున్నతంలో ఉండడమే కారణం.

కొరియాయుద్ధం ప్రారంభం కాగానే మెకార్థర్ మరతుపాకుల్ని, తుపాకుల్ని మందుగుండు సామగ్రిని జపాన్‌నుంచి పంపాడు. ట్రూమన్ ఆజ్ఞ లేకుండానే పంపాడట. కాని సంగ్రామారంభమైన కొన్ని గంటల అనంతరం ట్రూమన్ ఆజ్ఞ ఇచ్చాడు.

దక్షిణ కొరియన్ సైన్యాలు చెదిరి పారిపోతున్న సమయంలో అమెరికన్ విమాన నౌకాబలాల్నే కాకుండా లారీదళాన్ని కూడా పంపాడు. మెకార్థర్ సైన్యాల్ని పూసాన్ రేవుకి పంపినతరువాతనే ట్రూమన్ ఆజ్ఞ ప్రకటితమయింది. అదే రీతిగా ట్రూమన్ అనుమతి అందకముందే, ఉత్తర కొరియాపై విమానాల్ని పంపి బాంబులు వేయించాడని న్యూయార్క్ టైమ్స్ పత్రిక తెలుపుతోంది. ఇదేవిధంగా ట్రూమన్ అనుమతితో నిమిత్తంలేకుండా జపాన్‌లో ఒక్క దళాన్ని విడిచిపెట్టి మిగతా సైన్యాన్నంతనీ కొరియా పంపాడు

అంటే మెకార్థర్ని బట్టి అమెరికన్ ప్రభుత్వం నడుచుకుంటుందన్నమాట. దీనికి హేతువు పైన చెప్పినట్లు మెకార్థర్ భావాలు, నిర్ణయాలు అమెరికన్ జాతికి శిరోధార్యాలు కావడమే. రెండో ప్రపంచయుద్ధం అనంతరం అమెరికా అనుసరిస్తున్న విధానం మెకార్థర్ ఆశయాల కనుగుణంగా ఉంది. అందువల్లనే కొరియాలో ఐక్యరాజ్య సమితి తరఫున యుద్ధనిర్వహణకి సర్వసైన్యాధిపతిని అమెరికన్ ప్రభుత్వం నియమించవలసి వచ్చినప్పుడు, ఈ కర్తవ్యానికి తగినవాడు మెకార్థర్ తప్ప అన్యుడు కనిపించలేదు.

# మనదేశం

(5-వ పేజీ తరువాయి)

దోవలో పడ్డాట్ట రణదివె. సరిగా గీత తెలిసినవాడు రాజేశ్వర్రావన్న మాట.

చీనీ స్టాలిన్ మావ్ సే టుంగ్ పైన పాత పొలిట్ బ్యూరో "బాధ్యతారహితంగా దూషణపూరితమైన బొత్తిగా తప్పుడువిమర్శ" చేసినందుకుగాను కొత్త పొలిట్ బ్యూరో బేషరతుగా మనస్ఫూర్తిగా క్షమార్పణకోరుతూ సరిగా మావ్ అడుగుజాడల్లోనే నడవగలరని వాగ్దాన మిచ్చింది.

బొంబాయి ప్రభుత్వంచేత విడుదలైన రాజకీయఖైదీలు 165 మందిలోనూ ఒకడైన ప్రపంచకార్మికసంఘసమితి ఉపాధ్యక్షుడు డాంగేకూడా "బాంబులు వేసీ, ద్రావకాలు చల్లీ, రైళ్లు పడగొట్టీ" ప్రభుత్వాన్ని పడగొట్టగలరనే నమ్మకం తనకి లేదని చెప్తూ, పార్టీ ఇకనుంచి కొత్తవిధానాన్ని అనుసరిస్తుందన్నాడు. అయితే ఇప్పటికి పార్టీలో వచ్చిన చీలిక, పార్టీ పంథాను అర్థంచేసుకోడంలో భేదాభిప్రాయాలు కలగడం వల్లనేగాని అన్యథా కాదనీ, అందువల్ల చీలిక మళ్లీ అతుక్కుపోతుందనీ చెప్పాడు. అంటే జోషీ, సుందరయ్య, కంభంపాటి సోదరులు వగైరాలకి మళ్లీ పార్టీలో ప్రవేశం కలుగుతుందన్న మాట.

"హింసాకాండ, విధ్వంసకచర్యలు" త్యజిస్తారని, ఎన్ని చెప్పినా, "ఎక్కడ పడితే అక్కడ, ఎప్పుడుపడితే అప్పుడు తిరుగుబాటు చేయదలపెట్టారనే ప్రభుత్వ ప్రచారం శుద్ధాబద్ధమని" ఎన్ని చెప్పినప్పటికీ మావ్ పంథా అంటే చెయ్యెత్తిన పాపాన పోవనివాళ్ల పంథా అని ఎవరూ అపోహ పడరు. ఎక్కడపడితే అక్కడ ఎప్పుడు పడితే అప్పుడు తిరుగుబాటు చెయ్యనిమాట నిజమేకాని అనూ పానూ చూసుకునే చేస్తారని తెలుసును. తుపాకులు పట్టకుండా పార్టీ ఉద్యమం నడపదనికూడా అందరికీ తెలిసినదే. పార్టిజాన్ వార్ఫేర్ (నగ్న ప్రయుక్తసాయుధసంఘర్షణ) జరపనిదే కమ్యూనిస్టుపార్టీ పరిపాలనాధికారాన్ని సాధించడం ఇంతవరకూ ఎక్కడా జరగలేదు.

## సోషలిస్టుపార్టీ విచ్ఛిత్తి *

1942 క్విట్ ఇండియా ఉద్యమంలో అజ్ఞాతంలో ఉండి, గాంధీ మహాత్ముని ఆదేశానుసారం బైటపడినా అరెస్టుకాలేక పోయిన శ్రీమతి అరుణ అసఫ్ అలీకూడా సోషలిస్టు పార్టీనుంచి విడిపోవడం సంభవిస్తోంది. అస్సాంగవర్నర్* భార్యగా ఆక్టీ రాజకీయాల్లో పాల్గొనడానికి అవకాశంలేక పోయిన అరుణాదేవి యూరప్‌సంచారం బయలుదేరి అక్కడ సోషలిస్టు పార్టీలతో సన్నిహితభావం సంపాదించుకుంటోంది.

ఈమధ్య సోషలిస్టుపార్టీ వైఖరినిగురించి ఒక ప్రకటనచేస్తూ పార్టీ వెళ్లగొడితే తప్ప రాజీనామా చెయ్యనని ఆమె చెప్పింది. యూరప్‌లో సోషలిస్టులను దరిగానే భారతదేశంలో సోషలిస్టులికూడా డెమోక్రటిక్ సోషలిజమ్ వొంటబడుతున్నదని ఆమె విమర్శించింది. యూరప్‌లో డెమోక్రటిక్ సోషలిజానికి బ్రిటిష్‌సోషలిస్టులు నాయకులు, వీరికి మార్క్సిజం పాతబడిపోయింది. మార్క్స ఈ రోజునవుంటే తప్పుదారిన పడినవాడౌతాడని వీరి అభిప్రాయం. వీరిని దారికి కుడిప్రక్కగా తప్పుదోవ పట్టేశారని మార్క్సిస్టులంటారు. గాంధేయతత్వం అసలు మార్క్సిస్టు దోవకి కనుచూపుమేరలోనైనా లేకుండా మరీ కుడిప్రక్క పడిపోయిందని వీరి అభిప్రాయం. ఈ పరిస్థితిలో పెడముఖాలుగా నడిచే గాంధీగీత, మార్క్స గీతలకి సోషలిస్టులు ముడిపెట్టడానికి ప్రయత్నిస్తున్నారని మార్క్సిస్టుల ఆరోపణ.




అశోక మెహతా ఉవాచ: భారతదేశంలోని ప్రత్యేక పరిస్థితుల దృష్ట్యా సోషలిజం విస్తృతమైన సాంస్కృతిక శక్తిగా పెంపొందాలి. (శంకర్స్ వీక్లీ

అంటే మార్క్సుదోవకి దూరంగా పడిపోతున్నారన్నమాట లాస్కీ భక్తులైన భారత సోషలిస్టులు. ఇంక వీరిని మార్క్సు రోడ్డు పట్టించే ఆశ (యూరప్‌లో మాదిరిగానే) అడుగంటిపోయింది. అందువల్ల అటు మార్క్సిస్టులూ కాలేక, ఇటు గాంధీయిస్టులూ కాలేక, పరిశ్రమలకంటె వ్యవసాయం ప్రధానమైన మనదేశంలో లాస్కీ భక్తి ఆట్టే చలామణీ కాక మనసోషలిస్టులు ఎండమావులకోసం వేటాడుతున్నారని నిస్పృహచెంది దోవా తెన్నూ తెలియక కొందరు సోషలిస్టులు పార్టీకి దణ్ణంపెట్టి వెళ్ళిపోతున్నారు. వీరిలో అరుణాదేవి ఒకరు.

## భాషాబోధన *

మనపాఠశాలల్లో విద్యార్థుల్ని ఎన్ని భాషల్లో పండితుల్ని చెయ్యవలసిన అవసరం ఉంది, ఎన్ని భాషల్లో పండితుల్ని చెయ్యగలరు అనే సమస్యని శాశ్వతంగా పరిష్కరించలేకపోయినా, మన రాష్ట్రప్రభుత్వం ఏదో ఒకమాదిరి నిర్ణయం చెయ్యక తప్పదనే తెగింపుకి వచ్చి చివరికి తేల్చి చెప్పేశారు — ఇష్టమైతే విద్యార్థులు నాలుగు భాషలు చదువుకోవచ్చునీ, అక్కర్లేకపోతే రెండు భాషల్తో సరిపెట్టవచ్చుననీ చదివి తీరవలసిన భాషలు ప్రాంతీయభాష మాతృభాషల్లో ఒకటి, ఇంగ్లీషు ఒకటి. ఈ రెండు కాక ప్రజ్ఞావంతుడనుకునే విద్యార్థి వృత్తివిషయాన్ని విడిచిపెట్టి హిందీ చదవచ్చు. ఇంకా ప్రజ్ఞ కలదనుకునేవాళ్లు సంస్కృతం గాని మరొక దక్షిణాది భాషగాని చదువుకోవచ్చును. అంటే ప్రజ్ఞావంతుడైన విద్యార్థి ప్రాంతీయ భాషనీ (అంటే చెన్నపట్నంలో అరవం), మాతృభాష, ఇంగ్లీషు, హిందీ భాషలు నేర్చుకోవచ్చును. లేదా ప్రాంతీయభాష మాతృభాష కానిచోట విద్యాలయాధికారులు అనుగ్రహించి ఉభయ భాషల బోధనకే పూరి అవకాశమిస్తే సంస్కృతంకూడా నేర్చుకోవచ్చును అంటే చెన్నపట్నంలో ఒక స్కూల్లో తెలుగు ఏర్పరిచి ఉన్న పక్షంలో, ఆ విద్యార్థి విధిగా తెలుగు ఇంగ్లీషు నేర్చుకోవాలి. ఆ పైన హిందీ నేర్చుకోవచ్చును. ఇంకా కావాలంటే సంస్కృతం కాని అరవంకాని నేర్చుకోవచ్చును. స్కూల్లో తెలుగులేదనుకుంటే ఇంక ఆవిద్యార్థివిధిగా అరవం ఇంగ్లీషు చదవ్వలసిందే, పైన కోరితే హిందీ సంస్కృతం నేర్చుకోవచ్చును.

ద్విభాషాప్రాంతాల్లో రెండోభాష మాతృభాష గాకలవారికి ప్రయోజనం అధికం ఉండదు. వారి పరిస్థితి ఎప్పటిమాదిరిగానే ఉంటుంది. ఇంక పోతే హిందీ, సంస్కృతాలు నేర్చుకోడానికి వీలు కల్పిస్తారు. (అదికూడా చెన్నపట్నంలో తెలుగువిద్యార్థులికి చెప్పినట్లు సంస్కృతవిద్యార్థులికూడా పదిహేనుమందికి తక్కువ కాకుండా ఏకకాలంలో కట్టకట్టుకు రావాలని కోరే పక్షంలో ఆసంస్కృతంకూడా వ్యర్థమే అవుతుంది.

ఇంతాచేస్తే జరిగిన మార్పేమిటంటే నిర్బంధబోధనకి మూడు భాషల్లోనుంచి హిందీని తీసేసి రెండింటికి తగ్గించి, కోరి నేర్చుకోగలగాల్ని . రెండుచేశారు. ఇదీ ఉన్నంతలో కొంతనయమే. [సీతారామ్]

# నేటిప్రపంచం

(8-వ పేజీ తరువాయి)

(జనవాక్య నిర్ధారణ రష్యా అమెరికాలు ఏకమై నిరాకరించి ఉండేవి.

కాని నింద అమెరికాపై పడ్డంతో యుద్ధానికి కాలుదువ్వుతున్నవారిలో అగ్రస్థానం అమెరికాకే లభించింది. దీనితో బ్రిటిష్ అమెరికన్ పత్రికలకు నెహ్రూపైన రోషం వచ్చింది. అయితే నమలనూ లేక మింగనూ లేక గొంతుక్కు అడ్డుపడినట్లుగట్టిగా విమర్శించనూలేక నిగ్రహించుకొని వ్రాయవలసివచ్చింది. కాశ్మీరసమస్యసంగతిని ముందుగా నెహ్రూ పరిష్కరించుకుని తరువాత ఇతరసమస్యలసంగతి చూడవచ్చని న్యూయార్కు టైమ్సుపత్రిక వ్రాసింది. ఆ ప్రభుత్వాల ధోరణికూడా ఈ రీతిగానే వుంది.

ఈ సందర్భంలో బ్రిటన్ చేసే యత్నాల్ని గమనించి పోల్చవచ్చును. ఉత్తర కొరియన్ సైన్యాల ఉపసంహరణకు రష్యా తనపరపతిని వినియోగించవలసిందిగా బ్రిటిష్ ప్రభుత్వం రష్యన్ ప్రభుత్వాన్ని కోరింది. అంటే ఏమిచెయ్యాలని బ్రిటిష్‌వారి అభిప్రాయమైనట్లో తెలియపరచవలసిందని రష్యన్ విదేశాంగమంత్రి గ్రోమికో అడిగాడు. ఈ రీతిగానే బ్రిటిన్-రష్యన్ సంప్రదింపులు జరుగుతున్నాయి. వీని పర్యవసానం ఎలావుంటుందో సులువుగా గ్రహించవచ్చును.

చీనాకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని భద్రతామండలిలో ప్రవేశపెట్టడానికి నెహ్రూ విజ్ఞప్తిని ఈజిప్టుప్రభుత్వం నిరాకరించింది. బ్రిటిష్‌ప్రభుత్వం ఈజిప్టుపట్ల వైఖరిని మార్చుకునేవరకూ పూర్తిగా తటస్థవిధానాన్ని అవలంబించనున్నట్లు ఈజిప్టు ప్రభుత్వం స్పష్టపరిచింది.

## యుద్ధహేతువు *

కొరియాలో ఈ యుద్ధానికి హేతువులను గురించి భారతప్రభుత్వానికి కొంత సమాచారం తెలియవచ్చింది.

ఈ సంవత్సరారంభంలో కొరియాలోని అనధికారవర్గాలవారందరూ కొరియాదేశ సమైక్యతను గురించి సమాలోచనలు జరపడం అవసరమని అభిప్రాయపడ్డారు. ఉభయ ప్రాంతాలమధ్యనూ సరిహద్దులో ఉభయ ప్రాంతాల రాజకీయవర్గాల ప్రతినిధులూ సమావేశం జరిపి ఉభయప్రభుత్వాల ప్రతినిధుల్నికూడా ఆహ్వానించాలని యత్నం జరిగింది. ఈ యత్నానికి ఉత్తరకొరియా ప్రభుత్వం సమ్మతించింది కాని దక్షిణ కొరియన్ అధ్యక్షుడు సిగ్మన్‌రీ సమ్మతించక పోవడంవల్ల ఈ సమావేశం జరగలేదు.

అసలైన దక్షిణకొరియాలో ప్రభుత్వం శాసనసభ అదుపులో ఉండాలనే విషయం పైన దక్షిణకొరియన్ రాజకీయపక్షాలలో వివాదం సంభవించింది. కాని అధ్యక్షుడు సింగ్మన్‌రీ, అతనిప్రభుత్వం శాసనసభ అదుపులో ఉండడానికి నిరాకరించింది, ఈ సందర్భంలో శాసనసభాసభ్యులపైన పోలీసుబలాన్ని, సైనిక బలాన్ని ప్రయోగించి ప్రభుత్వం బెదిరించింది. కాని ప్రభుత్వం ఎంత దౌర్జన్యానికి దిగినప్పటికీ ఈ సమస్య శాసనసభలో చర్చకు వచ్చినప్పుడు ప్రభుత్వం శాసనసభ అదుపులో ఉండాలనే ప్రతిపాదనకి అనుకూలంగా 79 వోట్లు, ప్రతికూలంగా 33 వోట్లు వచ్చాయి. కాని 66 మంది వోటింగ్‌లో తల్లోనక పోవడంమూలాన మూడింట రెండు వంతులు వోట్లు లభించక తీర్మానం క్రమబద్ధం కాలేదు.

1950 మే మాసాంతంలో ఎన్నికలు జరిగినప్పుడు ప్రభుత్వం శాసనసభకు బాధ్యత వహించవలసిన అవసరం లేదా అనే వివాదంపైనే ఎన్నికలు నడిచాయి. అధ్యక్షుడికి నియంతృత్వాధికారం ఇవ్వడానికి దేశంలో అన్నివర్గాలవారూ విముఖులుగా ఉన్నారు. సింగ్మన్‌రీ ప్రభుత్వం ప్రజలపైనా ప్రతిపక్షరాజకీయవాదులపైనా ఎంతిగా పోలీసుబలాన్ని సైనిక బలాన్నీ ప్రయోగించినా ఎన్నికల్లో పరాజయం తప్పలేదు.

ఎన్నికల అనంతరం దక్షిణకొరియాలో రాజకీయ పరిస్థితిలో ఏలాటి మార్పు సంభవించలేదు. ఇంతలో దేశైక్యత సమస్యపై సమాలోచనలు జరపడం నిమిత్తం ఉత్తరకొరియన్ ప్రభుత్వ ప్రతినిధులు ముగ్గురు సరిహద్దు దాటి దక్షిణకొరియా వచ్చారు. వెంటనే దక్షిణకొరియా ప్రభుత్వం ముగ్గురినీ అరెస్టుచేసి కాల్చి చంపించింది.

దీనితో దక్షిణ కొరియన్ ప్రభుత్వం కుట్రపన్నుతున్నదనే అనుమానం ఉత్తర కొరియాలో అధికమయింది. దీనికి తోడు అమెరికన్ విదేశాంగశాఖ సలహాదారు జాన్ ఫాస్టర్ డల్లెస్ దక్షిణకొరియా వచ్చి ప్రభుత్వంతో ఏవో మంతనాలు జరపడం అనుమానాలకు మరింత తావిచ్చింది. దక్షిణకొరియన్ ప్రభుత్వానికి అమెరికా పూర్తిసైనిక సహాయం చెయ్యగలదనీ ఆయుధాల సరఫరా గురించి యిప్పటికే యత్నాలు జరుగుతున్నవనీ డల్లెస్ దక్షిణకొరియన్ ప్రభుత్వానికి చెప్పాడు. ఉత్తరకొరియాపైన దెబ్బతియ్యడానికి [illegible] సహాయం [illegible] హామీ ఇచ్చాడు. అందువల్ల అమెరికా ఆంతర్యం పట్ల సందేహించి దక్షిణకొరియాను అయుధ సైనికసహాయం అందేలోపునే జాగ్రత్త పడాలనే ఉద్దేశంతో ఉత్తర కొరియా దండయాత్ర చేసింది.

భారతప్రభుత్వానికి అందిన ఈ నివేదిక ద్వారా ఒక విషయం స్పష్టపడుతున్నది. ప్రస్తుతఘట్టంలో దురాక్రమణ నేరం కమ్యూనిస్టులపైనే ఉంది, కాని ఇప్పుడు కమ్యూనిస్టు దండయాత్ర చెయ్యకపోయినప్పటికీ, ఎప్పటికైనా ఉభయప్రాంతప్రభుత్వాల మధ్య సంఘర్షణ అనివార్యం. దక్షిణకొరియాలో ప్రజలు, సకలరాజకీయవర్గాలూ ఉత్తరకొరియాతో సమాధానం చేసుకొని దేశైక్యత సాధించాలనే కోరుతున్నారు. కాని అమెరికన్ సైనిక ఆయుధబలాల అండ చూసుకొని ప్రజాస్వామ్యసిద్ధాంతాల ననుసరించి ప్రభుత్వాన్ని నిర్వహించడానికి నిరాకరించి, నియంతృత్వం నెలకొల్పయత్నించాడు సింగ్మన్‌రీ. శాసనసభ అధికారాన్ని కాలదన్నిన సింగ్మన్‌రీప్రభుత్వాన్ని అమెరికన్‌ప్రభుత్వం బలపర్చింది.

## ప్రపంచయుద్ధానికి సన్నాహం*

కొరియాలో ఎంత సైన్యాన్ని ప్రయోగించినా, అమెరికన్ సేనలు [illegible] కమ్యూనిస్టులను తరిమి [illegible] తున్నాయన్నా, కమ్యూనిస్టుల చెలగాటాలన్ని రుచిచూసిన అమెరికన్ ప్రభుత్వం, తక్కిన రష్యాతో యుద్ధం చెయ్యాలంటే ఎంత సన్నాహం అవసరమో అంచనా వేసినది. ఆ ప్రకారం అమెరికన్ జాతిని బ్రహ్మాండమైన యుద్ధానికి సన్నద్ధపరుస్తున్నాడు ట్రూమన్. అయితే ఎంత సన్నాహం జరుగుతున్నదో అంచనా చూస్తే, ఇదంతా కొరియాపై మాత్రమే కాని ప్రపంచయుద్ధం [illegible] ప్రపంచమంతా ఏకమై దిర్చి [illegible] పోరాటానికి తగిన బలాన్ని [illegible] కొంటున్నాడు ట్రూమన్ యుద్ధసన్నాహానికి ఇదివరకు కోరిన 1325 కోట్ల డాలర్లు కాక అదనంగా సహస్రకోటిడాలర్లు (అంటే దాదాపు 5 వేల కోట్ల రూపాయలు) మంజూరు చెయ్యవలసిందని కాంగ్రెస్ కోరాడు. అవసరమని తోచినప్పుడు అమెరికన్ ప్రజల్ని నిర్బంధసైనికవృత్తికి పిలువడానికి అధికారం కోరాడు. అవసరాన్ని బట్టి దేశంలో వస్తువులపై కంట్రోల్సు పరిశ్రమల స్వాధీనం వగైరా అధికారాలనీ కోరాడు. సైనిక బలాలకు ఇదివరకు నిర్ణయింపబడిన గరిష్ఠ ప్రమాణ నిర్బంధాన్ని (20 లక్షలమంది) తొలగించి ఎంతమందిని

కొనలి నే అంతమువదిని చేయ్యడానికి అధికారాన్ని కోరాడు. ఖర్చులను తగినట్లు పన్నుల్ని హెచ్చించడానికి అధికారాల్ని కోరాడు. దేశరక్షణకు, అన్యదేశాల రక్షణకు, అన్యదేశాల్ని బలపరచడానికి అవసరాన్నిబట్టి నిర్ణయాలు చేసే అధికారం కోరాడు. ఇంత ఖర్చుతో ఇంతటి యుద్ధ సన్నాహం జరగడం అపూర్వం

అమెరికన్ ప్రభుత్వాం గుద్ధంగామిత్తం ఖర్చు పెడుతున్న మొత్తం ధనంతో భరతఖండాన్నంతనీ బ్లాక్ మార్కెట్ ధరకి కొనెయ్యవచ్చును.

## కొరియా యుద్ధగతి *

కొరియా యుద్ధం ప్రారంభమైన నాలుగు వారాల్లో కమ్యూనిస్టులు దక్షిణ కొరియాలో మూడింట రెండువంతులు ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. అమెరికన్ సేన లింకో ఎక్కడా నిలిచి పోరాడలేకపోతున్నాయి. తీవ్రసంఘర్షణానంతరం వెనుకకు తగ్గుతున్నాయి. కమ్యూనిస్టు అగ్రశ్రేణులపైన అమెరికన్ విమానాలు బాంబులు, రాకెట్లు జొపాళం బాంబులు విపరీతంగా ఎన్నికురిపించినా కమ్యూనిస్టుల పురోగమనాన్ని అరికట్టలేకపోతున్నారు.

దక్షిణకొరియా ప్రభుత్వం టేజాన్‌నగరాన్ని విడిచి టేగూనగరం చేసిన మూడు రోజులలో టేజాన్‌నగరం పూర్తిగా ధ్వంసమైపోయింది. కమ్యూనిస్టుసేనలు కీమ్ నదిని దాటి వెంటనే అనువైళ్లలో ఉన్న నగరంపైకి వచ్చాయి. నగరంవద్ద భీషణ యుద్ధం జరిగింది. అమెరికన్ సేనలు అక్కడ నుంచి ఎనిమిది మైళ్లు ఆగ్నేయంగా నిష్క్రమించాయి. కమ్యూనిస్టు సేనలు నగరాన్ని ఆక్రమించాయి. ఇక్కడనుంచి కమ్యూనిస్టు సేనలు రెండుగా చీలి, ఒకశాఖ తప్పించుకున్న దళాలతో చేరి దక్షిణంగా ... మించాయి. రెండోశాఖ అమెరికన్ సేనల్ని వెంబడించాయి. టేజాన్‌నగరంలో అమెరికన్ పదాతిదళాల అధిపతి జనరల్ డీన్ చిక్కుపడిపోయినాడు. టేజాన్ యుద్ధంలో డీన్ మంచిసాహసం ప్రదర్శించాడనీ, ఒకవంక శత్రువుల ఫిరంగులు అగ్నివర్షం కురిపిస్తుంటే అతడు శత్రువుల టాంకీస పరీక్ష చేస్తూ నిశ్చింతగా కూర్చున్నాడని అమెరికన్ వార్తలు తెలుపుతున్నాయి. చివరికి శత్రువుల చేతుల్లో పడకుండా తప్పించుకున్నట్లు చూసినవాళ్లెవరో చెప్పారని టోక్యోలోని అమెరికన్ యుద్ధకార్యాలయం ప్రకటించింది.

టేజాన్‌నగరాన్ని మంటల్లో ముంచెత్తిన తరవాత పలాయనమై తిరిగి సమాయత్తమైన అమెరికన్ సైన్యానికి మూడురోజులు యుద్ధం నుంచి విశ్రాంతి లభించింది. విశ్రాంతి అనంతరం యాంగ్‌డంగ్ ప్రాంతలో తిరిగి యుద్ధం ప్రజ్వలించిందనీ, అక్కడనించి మళ్లీ అమెరికన్ సేనలు తిరుగుముఖం పట్టాయనీ వార్తలు వస్తున్నాయి.

పశ్చిమతీరం దాపుగా దక్షిణానికి పురోగమిస్తున్న కమ్యూనిస్టుసేనలు మూడు రోజుల్లో ఐరి, బోంజూ రైల్వేకేంద్రాన్ని పట్టుకుని ఇమ్సిల్‌వద్దకు చేరారు. అక్కడనుంచి దక్షిణతీరాన సుచాన్ రేవుకి 35 మైళ్ల దూరంలోకి చేరారు. ఈ ప్రాంతంలో కమ్యూనిస్టుసేనల్ని ఎదిరించినవారు లేరు.

టేజాన్‌నుంచి యాంగ్‌డాంగ్ వద్దకు చేరిన అమెరికన్ సేనలతో కొన్ని కమ్యూనిస్టుదళాలు పోరుతున్నాయి. కొన్నిదళాలు పెద్దకొండల ఆటంకంలేని ప్రాంతంగుండా టేగూనగరముఖంగా నడుతున్నాయి. ఈ సేనల్ని కూడా ఎదిర్చి పోరాడేవారు లేరు.

కేంద్రరంగంలో హాంచంగ్ - ఆండంగ్ శ్రేణిలో అమెరికన్లు దక్షిణ కొరియన్లు



కలిసి కమ్యూనిస్టులతో పోరాడుతున్నారు.

తూర్పుతీరాన కొండలచాటున లోయల్లో ఉత్తరకొరియన్ కమ్యూనిస్టుబలాలు విశేషంగా కేంద్రీకరించబడుతున్నందువల్ల, వెంటనే ఫూసాన్‌రేవుకి ముప్పు కలక్కుండా కాపాడుకోడంనిమిత్తం జనరల్ మెకార్థర్ జపాన్‌లో నిలువరించబడిన అమెరికన్ దళాల్లో ఒక దళాన్ని తెచ్చి యుద్ధనావలసహాయంతో పోహాంగ్ రేవువద్ద దించాడు. జపాన్‌లో కల నాలుగుఅమెరికన్‌డివిజన్లలోను రెండుడివిజన్లు ఇదివరకే జనరల్ డీన్, జనరల్ రాచర్ట్స్‌ల అధిపత్యం పంపబడినాయి. వీనిలో ఒక దళం టేజాన్ నగరసమీపంలోనూ కేంద్రరంగంలోనూ పోరాడుతుంది. రెండోదళం ఫూసాన్‌రేవు సమీపంలో కాపలా ఉంది. పరిస్థితి విషమిస్తున్నందువల్ల జపాన్‌దేశంలో ఒక్క డివిజన్‌ను మాత్రమే ఉంచి దైవంపైన భారంవేసి మిగతా ఒక్క డివిజన్‌ని పోహాంగ్ రేవువద్ద దించాడు. ఈ దళంలో రెండో ప్రపంచయుద్ధ వీరులు, నీగ్రోలుకూడా ఉన్నారు. దిగినవెంటనే ఈ సేనలు ఉత్తరంగా పది మైళ్ళ దూరం లోయగుండా వెళ్లి కమ్యూనిస్టుసేనల్ని ఎదిరించాయి. ఈ యుద్ధం ప్రారంభం కావడానికి ముందు ఇరవై నాలుగ్గంటలసేపు బ్రిటిష్ అమెరికన్ యుద్ధనౌకలు యాంగ్‌డక్ నగరంపైన అగ్నివర్షం కురిపించి నగరాన్ని నేలమట్టం చేశాయి. అపైన అమెరికన్ సేనలు యాంగ్‌డాక్ నగరాన్ని ఆక్రమించుకున్నాయి. అగ్నివర్షం కురిపిస్తున్న సమయంలో లోయలో దాగిన కమ్యూనిస్టు సేనలు అమెరికన్‌సేన నగరం చేరగానే ముట్టడి ప్రారంభించాయి. ముట్టడి ప్రారంభమైన ఒకరోజులో అమెరికన్‌సేన యాంగ్‌డక్ నగరాన్ని విడిచిదక్షిణానికి వచ్చిన దారినే వెళ్లాయి.

[సూర్యనారాయణ]







శత్రువిమానాల రాకను కనిపెట్టడానికై దీక్షగా చూస్తున్న అమెరికన్ వైమానికదళంవారు.



ఉత్తరకొరియన్ కమ్యూనిస్టులపై అమెరికన్ తుపాకిదళంవారి భీషణమైన తుపాకికాల్పులు





ఉత్తర కొరియాలో కమ్యూనిస్టు దురాక్రమణకు పాలైన కొందరు అభాగ్యులు తలదాచుకోడానికై కాలినడకను గ్రామాంతరాలకు వెళ్లిపోతున్నారు.





జెనరల్ జె. లాటన్ కాలిన్సు (ఎడమ వైపు) సమర్పించిన ఐక్యరాజ్య పతాకను ఆదరంతో స్వీకరిస్తున్న మెకార్థర్.

కొరియన్ యుద్ధరంగానికై ఒకానొక రైల్వేస్టేషన్లో దిగుతున్న అమెరికన్ ఆయుధపరికరాలు.





# కొరియా యుద్ధము



Regd. No. M. 4479



Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras